ఆంధ్రసచిత్రవార

# పత్రిక

సవరించుకోవలసిన కొన్ని లోపాలు !

14-12-1962



25 నయాపైసలు





"అలాగే ఉద్యోగాలు ఖాళీ ప్రకటనలు కూడా చదివెయ్యండి"

# మీ పొలాల నుంచి
# సాధ్యమైనంత ఎక్కువ పండించండి

# పండుగ రోజులవలె మీ యింటిని నిత్యమూ కలకలలాడేలా చేసుకోండి!

## Kleertone 'క్లియర్‌టోన్' తయారులను అమర్చుకోండి!




మీ నిత్య జీవితమునకు పండుగ సరదాను తెచ్చుకోండి! క్లియర్ టోన్ యింట్లో వాడుకొనే తయారులతో సౌఖ్యముగా ఉండండి మరియు మీ యింటికి అందము మరియు శుభ్రత కలిగేలా చేసుకోండి క్లియర్ టోన్ తయారులను ప్రతి నిత్యమూ ఉపయోగించుకొనవచ్చును వాటితో మీకు కాలములో, శ్రమలో మరియు డబ్బులో పొదుపు చేకూరుతుంది

క్లియర్ టోన్ వస్తువులు మీ ఆప్తులకు బహుమానముగా యిచ్చుటకు లేక మీరే వాడుకొనుటకు ఎంతో బాగుంటాయి వాటిని మీరు పండుగ రోజుల్లో లేక ఎప్పుడైనా కొనుక్కోవచ్చును క్లియర్ టోన్ బహుమానమును నేడే కొనండి!



క్లియర్ టోన్
కుకింగ్ రేంజ్



క్లియర్ టోన్
ట్విన్ హాట్ ప్లేట్



క్లియర్ టోన్
హాట్ ఫుడ్ క్యాబినెట్



క్లియర్ టోన్
వాటర్ బాయిలర్





క్లియర్ టోన్
ఇంపీరియల్ టోస్టర్




క్లియర్ టోన్
ఎలక్ట్రిక్ గడియారము



క్లియర్ టోన్ థెర్మల్ జార్



క్లియర్ టోన్
ఇంపీరియల్ ఇస్త్రీ పెట్టె



క్లియర్ టోన్
ఎలెక్ట్రిక్ కెటిల్

క్లియర్ టోన్
ఫోల్డింగ్ కుర్చీ మరియు టేబిల్







క్లియర్ టోన్
వాటర్ హీటర్



క్లియర్ టోన్
ల్యాంప్స్, ఫ్లోరెసెంట్ ట్యూబ్స్ & ఫిక్చర్స్

మీ దగ్గరలోనున్న క్లియర్ టోన్ లేక నేషనల్-ఎక్కో రేడియో డీలరునుండి ఎక్కువ వివరములను తెలుసుకోండి

**GRA** జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్
బొంబాయి . కలకత్తా మద్రాసు ఢిల్లీ
పాట్నా . బెంగుళూరు . సికిందరాబాదు.



RWT-GRA 4227 (A)

## ఉత్తరాలు

### ముఖచిత్రం

30—11—62 వ తేదీనాటి ఆంధ్రపత్రిక వారపత్రికవారి అట్టమీద బొమ్మను చూచి నేను నిజముగా శ్రీమతి సావిత్రి యని తలచితిని. లోపల చూచుసరికి అనూరాధ అని తెలిసింది. శ్రీమతి అనూరాధను పరిచయము చేసినందులకు మీకు నా కృతజ్ఞతాభివందనములు

బండారుపల్లి సుబ్బారావు (పెదనందిపాడు)

*  *  *

ముఖచిత్రం (అనూరాధ) చాలా బాగానూ, ఆకర్షణీయంగానూ ఉన్నది "అనూరాధ" బి ఎస్ సి చదివారని నా మిత్రుడూ; కాదు, స్కూల్ ఫైనలని నేనూ అనుకుంటున్నాం దయచేసి జవాబు తెలియజేస్తారా?

శ్రీ కోటి, సుబ్రహ్మణ్యం (గుంటూరు)

**మాకూ తెలియదు.**

*  *  *

'చిత్రవ్యక్తుల' శీర్షిక క్రింద వార పత్రిక క్రొత్త నటులకు ఆంధ్ర పాఠక—కమ్—ప్రేక్షకులలో మంచి పబ్లిసిటీనే ఇస్తోంది కాని, వారిని గూర్చిన కొన్ని వివరాలు అసహజంగా, అసందర్భంగా, అసహనీయంగా ఉన్నవని తెల్పుటా న్కి విచారిస్తున్నాం 30—11—62 సంచికలో 'అనూరాధ' అనే నటిని పరిచయం చేస్తూ ఆమె 1944 లో పుట్టిందన్నారు అంటే ఇప్పటికి 17 వ ఏడు పూర్తయ్యిందన్నమాట ఆమె మొదటి చిత్రం 'పాండురంగ మహాత్మ్యం' వచ్చి అధమం 4 ఏళ్లయినా అయ్యుంటుంది అంటే 13 వ ఏట అందులో నటించిందన్నమాట అంతకు ముందు అన్నయ్య ట్రాన్స్‌ఫర్ మూలంగా మద్రాసు వచ్చి తమిళం, డాన్సు వగైరాలు క్షుణ్ణంగా నేర్చుకుందిట అంటే అధమం మద్రాసులో రెండేళ్లయినా ఉండిఉండాలి అక్కడికొచ్చేసరికి హైస్కూలు చదువు పూర్తవ్వటోటూ ఆగిపోయిందన్నారు అంటే ఎస్సెల్సీ పదకొండో ఏట చదివిందనేగా అర్థం?

'బృంద—అందేప్' (వాల్తేర్)

*  *  *

మా అభిమాన హాస్య నటశేఖరుని ఒరిజినల్ మార్కు పోజును ముఖచిత్రం వేసి, అతన్ని పరిచయం చేసినందుకు ఇవే మా అభివందనలు నిజంగా అంత హాస్యోద్విగ్నమయిన పోజును ఇవ్వటం మా ప్రియ పద్మనాభానికి తప్ప ఎవరికీ చేతకాదు కాని నిజంగా ఆతనికి 31 ఏళ్లున్నాయా? ఏ ఇరవయ్యో ఉన్నాయనుకున్నాము

శ్రీ సత్యనారాయణరాజు, జి వెంకటేశ్వర్లు, డి రంగయ్య (ఖమ్మం)

*  *  *

ముఖచిత్రము పద్మనాభం ఫోటో బాగానే ఉన్నది దవడమీద వ్రేలు పెట్టడము, మూతి ప్రక్కకు త్రిప్పటం సమంజసముగా ఉన్నది

ఖాదర్‌షరీఫ్ (భీమవరం)

### చిత్రవ్యక్తులు

ఆంధ్రుల అభిమాన నటి అనూరాధను పరిచయం [illegible] కాకం యిస్తే అగ్రశ్రేణి తారల లిస్టులోకి వచ్చే తారలలో అనూరాధ ఒకతె.

'శ్రీనాథ్ (రాజమండ్రపురం)

*  *  *

సినీ నటుడు పద్మనాభమును పరిచయముచేసినందుకు మాకు చాల సంతోషము మీకు కూడ అభివందనములు కాని ఇతనికి పెండ్లి అయినదో కాలేదో మాకు తెలియపరచలేదు అతి త్వరలో పాఠకులకు తెలియపరుస్తారని ఆశిస్తున్నాను

ఎ కస్తూరికుమారి (హైదరాబాదు)

### కథ

30—11—62వారపత్రికలోని 'యుగధర్మం' కథలో పటుత్వంలేదు అందులో కథానాయకుడు సంజీవరావుకు కోర్టువారు యావజ్జీవకారాగారశిక్ష విధించారు కానీ మళ్లీ 15 సంవత్సరాల తర్వాత విడుదల చేయబడ్డాడని వ్రాశారు జీవితాంతం కారాగారవాస శిక్ష విధించబడ్డ సంజీవరావు 15 సం ల తర్వాత ఎలా విడుదల చేయబడ్డది రచయిత తెలుపలేదు దానికి పత్రికాముఖంగా సమాధాన మిస్తారని ఆశిస్తున్నాను

శివనాగేశ్వరగుప్త (ఖమ్మం)

యావజ్జీవ కారాగారశిక్ష అంటే జీవితాంతం వుండదు

### సరాగమాల

నన్ను చాలా రోజులనుండి పీడిస్తున్న సందేహాన్ని తీరుస్తారని నమ్ముతున్నాను పాటలలో, పాటతాలూకు మాటలని ఆధారము చేసుకొని రాగం (ట్యూన్) కడతారా? లేక రాగాన్నిబట్టి మాటలు వ్రాస్తారా? మాటల కనుగుణంగా రాగం కడతారని చాలామంది చెప్తారు అలా అయితే 'డబ్బింగ్' పాటల విషయ మేమిటి?

సురేశ్ (ఒంగోలు)

*  *  *

'మాంగల్యబలం' లో దేలంగి, జానకులోచనలు తిరుపతి కొండలపై కారులో బయలుదేరుతున్నప్పుడు ఇచ్చిన నేపథ్య సంగీతాన్ని పాట రూపంలో "కులదైవం" లో దింపారు శ్రీ వేణు గారు ఆ పాటపేరు "ఆడి పాడెను నా మది ఈవేళ .." సినిమాలో రెండో పాట, కృష్ణకుమారి పాడుతుంది అట్లాగే "అనాడి" లో రాజకపూర్ "సిసికి ముస్కురా హాట్" అని రోడ్డమ్మట పాడుకుంటూ వెళ్తున్నప్పుడు దానికి ఈలతో ఇచ్చిన నేపథ్య సంగీతాన్ని "ఉజాల" లో పాటరూపంగా దించారు శంకర్ జైకిషన్‌లు ఆ పాట షమ్మికపూర్ రోడ్డు మీద బండి తోసుకుంటూ పాడతాడు ఇలాగ ఇంకా కొన్ని కొన్ని ఉన్నాయి దీనినిబట్టి కొందరు మ్యూజిక్ డైరెక్టర్లు ముందే కొన్ని ట్యూన్‌లను కట్టి, తాము ఎదురుచూసే బక్కింగులకై అంత బెంగ పడకుండా కొంత నిశ్చింతంగా ఉంటారని అనుకుంటాము

న్యాయపతి బలరామదాసు (సంబల్‌పూర్)

*  *  *

అనుకరణ సంగీతం వినిపించేవారిలో కేవలం ఒక్క దక్షిణామూర్తిగారే కాక శ్రీ రాజేశ్వరరావు, శ్రీ పెండ్యాల, శ్రీ ఘంటసాలగార్లు కూడా ఇస్తారని నాగమణిగారు (చిలకలపూడి) తెలిపినారు. కాని వారు చిన్న పొరపాటు చేసినారు. "దాగుడుమూతల దాంపతురా" అన్న పాట "భలేరాముడు" చిత్రంలోనిదని వారు తెలిపినారు. కాని అది "భలే అమ్మాయిలు" అని వ్రాయవలసినదని గ్రహించ ప్రార్థన

రంగప్రసాద్ (కర్నూలు)

*  *  *

ఘంటసాలగారి బాణీలన్నీ (దాదాపు) కాపీవని చిలకలపూడి నాగమణిగారు 30—11—62 సంచికలో సెలవిచ్చారు అది ఆయన తప్పుకాదు. కాపీల కుదాహరణగా శభాశ్‌రాముడు, శాంతినివాసం, శభాశ్ రాజా చిత్రాల నుదాహరించారు. అభిమానంలో కూడా ఇటువంటి కాపీ పాట లున్నాయి ఇచ్చితంగా నాకు తెల్సినంతవరకు "ఓహో బస్తీ దొరసాని" అనే పాట ఈ పై చిత్రాలు నాలుగు ఒక్కరే నిర్మించారు ఇక పోతే శ్రీ ఘంటసాల సంగీత దర్శకత్వం వహించిన చిత్రాలలో నాకు ఎక్కడా కాపీ పాటలు కన్పించలేదు సంగీత దర్శకుడు బాణీలు కట్టడంలో కూడ నిర్మాత యిష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుందని పై విషయాన్ని బట్టి మనం తేలిగ్గా ఊహించుకోవచ్చు ఈ విషయాల్ని ఒకసారి రంగారావుగారు సెలవిచ్చారు, కీర్తనతో కూడ కాబట్టి ఘంటసాల గార్ని, వీర్నేమిటి ఎవరినైనా పరిస్థితులు తెల్సుకోకుండా దుయ్యబట్టడం ఏమంత సమంజసంగా లేదు

వై వి ఎస్ ఆర్ ప్రసాద్ (యడ్డనపూడి)

*  *  *

30—11—62 తేదీ సంచికలో చిలకలపూడి నుంచి నాగమణిగారు వ్రాసిన సరాగమాల విమర్శలో సంగీతం కాపీ చేస్తున్నవారిని గూర్చి వ్రాస్తూ "భలేరాముడు" చిత్రానికి రాజేశ్వరరావుగారు మ్యూజిక్ డైరెక్టరు అని వ్రాశారు. ఆ చిత్రానికి ఘంటసాలవారు మ్యూజిక్ డైరెక్టరు, రాజేశ్వరరావు కాదు గమనించ ప్రార్థన.

శ్రీకంఠం రామచంద్ర (అనంతపురం)

*  *  *

దేవదాసు చిత్రంలోని 'జగమే మాయా' పాటను తలదన్నునట్లుగా ఘంటసాలవారు పాడిన "ఒక చేతను మధుపాత్ర" అను పాట "పాండురంగ మహాత్మ్యము" లోనిది అవి రేడియోలోను, బయట విన్నాము—ఆపాట సినిమాలో లేకపోవటానికి కారణం ఎవరయినా వివరిస్తారా?

అలాగే నతాశ సన్నివేశంలో హాల్లోని ప్రేక్షకులను ఒక్కసారి కుదిపేలాగు ఎత్తుబడిలో ప్రారంభమయిన "చరిత్ర ఎరుగని మహాపాతకం మా దేశానికి పట్టెనదా" (తిమ్మరుసు) అనే పాటను—శ్రీ కృష్ణరాయబారంలో అశ్వత్థామ సంగీత దర్శకత్వంలో పి లీల పాడిన 'జగమేలు వీరాధివీర రాజరాజ" అనే పాటను కాళిదాసు చిత్రంలోని మొట్టమొదటి పాట ( .. రాజేశ్వరి) అనే పాటలను మీరు సమీక్షిస్తే తెలుసుకోవాలని చాలా కుతూహల పడుతున్నాను.

[illegible] (వి. [illegible])

# మీ పిల్లలకు దగ్గుగాని రొంపగాని వచ్చినప్పుడు

## నిజమైన స్వస్థత చేకూర్చుటకు







# సిరోలిన్ 'రోష్' ఇవ్వండి

మీ పిల్లలయొక్క దగ్గును రొంపను ఉపేక్షించకండి శీఘ్రముగా నిరపాయముగా నిజమైన స్వస్థత చేకూర్చే సిరోలిన్ ఇవ్వండి. అది చాలా సౌమ్యముగా పనిచేయును. మీ బిడ్డలు దాని రుచికి యిష్టపడుదురు సిరోలిన్ మీకు కూడ ఎంతో మంచిది. అది దగ్గును ఆపడమే కాకుండా దగ్గుకు మూలకారణమగు హానికరమైన సూక్ష్మ క్రిములను నశింపచేయును. సిరోలిన్ గొంతు నొప్పిని ఉపశమింపచేయును కఫమును నుసను పోగొట్టును. ఎంత బాధాకరమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత కలుగజేయును.




## గృహమందు సిరోలిన్ తప్పక ఉంచుకొనండి

WT-VT 2399

రోష్ తయారు  పోల్ డిస్ట్రిబ్యూటర్సు: వాల్టాస్ లిమిటెడ్

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం 14—12—62
శుభకృత్ సం॥ మార్గశిర ॥ బ॥ తదియ
సంపుటము 55 సంచిక : 15
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా రూ 13 00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail రు 20 00. విమానంద్వారా (Air Mail) (బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ 114 00 అమెరికా రూ 176 50. ఆస్ట్రేలియా 135 00)

*

విడి ప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





దేవిక

# మనలోమాట

బొంబాయి ఆంధ్రమహాసభ వారు ఈ ఏడాది కూడా కథల పోటీ జరిపారు. పోటీలో బహుమతులు గెలిచిన మూడు కథలూ త్వరలో పాఠకులకు అందించగలము!

* * *

పై వారం నుంచి ఆంధ్ర సచిత్ర వార పత్రిక 'కాలం' (Column) పొడిగించపోతున్నాము. దీనిని గురించి ఇంతకుముందే వ్రాశాం. వీలైనంతవరకూ కథల బొమ్మలు చిన్నవి చేయిద్దామని కూడా ప్రయత్నిస్తున్నాము. అంతేకాక, కొన్ని శీర్షికల 'హెడింగ్'లు చిన్నవి చేస్తున్నాము!

* * *

శ్రీ రంగధామ్‌గారి 'శ్రీదేవి'- రెండవ బహుమతి నవల 28-12-62 ఆంధ్ర సచిత్ర వార పత్రికనుంచి ప్రారంభిస్తున్నాము. శ్రీరంగధామ్‌గారి 'ఏడుకొండలు' నవల ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించిన సంగతి పాఠకులకు తెలుసు!

# లోకంపోకడ



"ఏమయ్యా! కొంపదీసి ఈ లావుపాటావిడ మారువేషంలో ఉన్న "మావా" కాదు గదా!! ......"

# విషయానుక్రమణిక



మీమీ పంతాలను వొదులుకుంటేయీ పోట్లాటలేవుండవు
పాతభావాలు
పాత ఆటంకాలు
రక్షణా భారం
ఒకబరువైనా తగ్గితే గాని మొయ్యలేమేమో!
అమ్మమ్మ! ఇదంతా చదవకూడదు తప్పుతప్పు!
చైనా దురాక్రమణా లోని నిజా నిజాలు
నిజమైన అధీనపు సరిహద్దు అంటే ఏమిటో అనా? నీప్రశ్న! వెర్రివాడా! మన చెయ్యి చాపినంతమేరా మన అధీనపు హద్దేనోయ్!
OOMMEN

# మంత్రి మండలిపై ప్రధాని వ్యామోహం

## శ్రీ కృష్ణ

ఇప్పుడు న్యూఢిల్లీ నగరమంతా చీకటి వెలుగుల దోబూచులాటలోనే ఉంది చైనా రాకాసి నీడలు నెమ్మది నెమ్మదిగా నీఫా అడుగుదాకా వ్యాపించాయి ఒక తూరి 'దాడి' లో విజయం పొందిన చైనీయులు నవంబర్ 20 తేదీన బుడాపెస్టులో హంగేరియన్ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ ప్రారంభంనాడు, భారత్—చైనా సరిహద్దు సమస్యా పరిష్కారానికి కొన్ని క్రొత్త ప్రతిపాదనలు చేశారు భారతదేశం లఢక్‌లోని అక్సాయిచిన్ ప్రాంతానికి నీళ్ళ వదులుకునేటట్లయితే తాము 'అక్రమమయిన మెక్‌మాహన్ రేఖ' దగ్గరకు తరలిపోవటానికి ఇంకా సంసిద్ధంగా ఉన్నామని ఈ ప్రకటన సారాంశం చైనీయులు ప్రతిపాదిస్తున్న దానికి మన ప్రధాన మంత్రి చెప్తున్న సెప్టెంబరు 8 నాటి స్థితికి తేడా ఇలా ఉంటుంది :

తూర్పున మనం తాగ్లాపర్వత ప్రాంతం వదులుకోవాల్సి ఉంటుంది

పడమట మన లఢక్‌లో మూడు సైనిక కేంద్రాలు తిరిగి నెలకొల్పుకుందామనే ఆశ ఏదన్నా ఉంటే దాన్ని మర్చిపోవాల్సిందే

వీటన్నిటికన్న బ్రహ్మాండమైన ప్రతిపాదన త్రయం ఏమిటంటే :

"చైనావారు తమ సైనికులను వెనక్కి మళ్లించుకునే పదిరోజులపాటు భారత సైనికులు యుద్ధ విరమణను పాటించాల్సిందే.

అంతేకాదు చైనా సైన్యాలు వెనక్కి వెళ్లి పోతున్నప్పుడు, భారత సైనికులు మెక్‌మాహన్ రేఖదాకా రావటానికి వీల్లేదు ఆ హద్దుకు 12½ మైళ్ళ దూరంలో ఆగిపోవాలి అలాగే లడక్‌లో స్వాధీనరేఖ ప్రాంతంకు 12½ మైళ్ళ దూరం నిలబడిపోవాలి మధ్య ప్రాంతం (ఉత్తరప్రదేశ్)లో కూడా అలాగే భారత సైనికులు పాటించాలి

వినాశకరమైన పురోగామి పద్ధతులవల్ల భారత సైనికులు 1961 లో స్వాధీన రేఖ అక్రమంగా ఏర్పడినవి, చైనీయుల దండయాత్రవల్ల పాడైనవి—ఆ 43 సైనిక కేంద్రాలను మళ్లీ నెలకొల్పే ప్రయత్నాలేమీ చేయకూడదు"

మన ప్రధాన మంత్రి పార్లమెంటులో ప్రసంగిస్తూ, పోరు ప్రస్తుతానికి ఆగిందని, తరువాత పరిస్థితులు ఎలాంటివో ఓపికతో వేచి చూడాలని అన్నారు అయితే ఈలోగా భారతదేశం తన రెక్కలకు బలం సమకూర్చుకోవాలి ఆయుధాలు తెచ్చుకోవాలి ఒకవేళ తిరిగి దాడి జరిగితే ఎదుర్కొనేందుకు, చైనాతో శాశ్వతంగా యుద్ధం ఆపుచేసేందుకు ఇది అవసరం. మొదటి దాడిలో కొంత లాభం కలిగింది కనుక, చైనీయులు మనం సైనికంగా చిత్తయితే తప్ప మనల్ని శాంతియుతంగా ఉండనివ్వరు ఈ వారంలో ఇక్కడ సమావేశమైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, చైనా ప్రతిపాదనలు అస్పష్టంగా, అయోమయంగా ఉన్నాయని తీర్మానించారు అసలవి ప్రతిపాదనలే కావు, కనుక వాటిలో అయోమయంగా ఉండేదేమీ లేదని కూడా వాళ్లే విమర్శించారు

కామన్వెల్త్ కార్యదర్శి శ్రీ డంకన్ శాండీస్, శ్రీ ఎ హారిమన్‌ల నాయకత్వాన బ్రిటిష్, అమెరికన్ ప్రతినిధి వర్గాలు రావటంతో న్యూఢిల్లీకి కాస్త వెలుగు కన్పించినట్లయింది

ఈ ప్రతినిధివర్గాలు, భారతదేశ సైనికావసరాలను గూర్చి, వాటి సాధన గూర్చి భారత ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి కావలసిన వాటిని తెలుసుకుంటాయి. అటుపైన తాము సరఫరా చేయగల వాటిని భారతదేశానికి తెలుపుతాయి

భారతదేశంలో ఎంతోమంది మనకు తెలిసినవాళ్ళు వాళ్ళు, తెలియనివాళ్ళు దేశ రక్షణకు ఎలా పూనుకుంటున్నారో ఈ క్రింది రెండు ఉదాహరణలవల్ల తెలుస్తుంది

"బొంబాయికి చెందిన ఇద్దరు పిల్లలు తలా ఒక రు 151 లు రక్షణ నిధికి సమర్పించారు. చేతి—గడియారం కొనుక్కోమని వాళ్ల తలిదండ్రులు ఈ ధనం యిచ్చారట (1) మద్రాసులో బిచ్చగా డొకడు తన దగ్గర చాలా కాలం నుంచి దాచిపెట్టుకున్న కోడినిస్తే వేలంలో రు 100 వచ్చింది ఇంకా కొన్ని వేలమంది తమ సర్వస్వాన్ని ధార పోస్తున్నారు మరికొంతమంది స్వతంత్ర భారత మనుగడకోసం తమ ప్రాణాలే అర్పిస్తున్నారు

ఇది ఇలా ఉండగా దేశ రక్షణ సందర్భంగా ప్రభుత్వ సమాచార శాఖ వెలువరించిన ప్రకటనలో ఇలా పేర్కొనటం జరిగింది :

"యుద్ధ ప్రయత్నాలనేవి చాలా సర్వతోముఖంగా భారీగా జరిగే ప్రయత్నాలు దేశీయంగా చూసుకుంటే పొదుపుగా బ్రతకటమనేది దానివల్ల జరిగే ప్రయోజనాల్లో ఒకటి

ఇటీవలనే దేశీయ వ్యవహారాల శాఖ అధికార స్థాయిలో పొదుపు అని దేన్ని అనగలమో నిర్వ

56 పేజీ చూడండి

## జాగ్రత్త!

### పి. గణపతిశాస్త్రి

విషభుజంగమం చైనా వేయిపడగలతో విరుచుకుపడినా,
తుషారగిరి శిఖరాలపై ధూమకేతువై ప్రజ్వలించినా,
వీరాధి వీరులమై విజృంభించగలం !
దూర దూరంగా తరిమివేయగలం !
కానీ, మనలోనే ఉన్నాయినుమా! కడుంగడు దుష్టసర్పాలు! జాగ్రత్త !
కనిపెట్టి పొంచిఉండి కాటువేసి పోగలవు సుమా ! జాగ్రత్త !
ఎర్రనివి కొన్ని నల్లనివి కొన్ని ఇంటిదొంగలై పోరాడుతున్నాయి నిజమే!
ఇటువంటి తరుణంలో ఏమరుపాటు పనికిరాదు ! మిత్రమా ! జాగ్రత్త !
రెండు నాలిక లల్లల్లాడించి నిండుగుండెలోనే నిద్రించగలదీ పాపజాతి !
ఉండి ఉండి తీయని తేనెపలుకులతో ఊరించి జోకొట్టగలదు ఉరాతి !
విశాల భారతావనిలో జన్మించినా విదేశాలమీదనే దీని కైపు !
కన్నతల్లి పాలారగించినా తిన్నఇంటి వాసాలమీదనే దీనిచూపు !
విషభుజంగమం చైనా వేయిపడగలతో విరుచుకుపడినా,
వీరాధి వీరులమై విజృంభించగలం !
కానీ, మనలోనే ఉన్నాయి మిత్రమా!
కడుంగడు దుష్టపన్నగాలు ! జాగ్రత్త !!

# విచిత్ర వివాహం–1

## శ్రీ 'యు'

(గత సంచిక తరువాయి)

ఇంతలో శాస్త్రిగారికికూడా కబురు పెట్టటం జరిగింది.

అర్ధరాత్రి; రాజు మద్యం మైకంనుంచి ఇంకా తేరుకొనలేదు ఆతడు తేరుకుని పరిస్థితి నూహించు కొనే లోపలనే రావుగారు కామజ్యోతిని ఇంట్లో నుండి బైటికి నెట్టటం జరిగింది

ఇంతలో శాస్త్రిగారు వచ్చారు తనకు ద్రోహం చేశాడన్నారు తన కూతురుకు అన్యాయం చేశాడన్నారు ఇంకా ఎన్నో విధాల సభ్యత నేర్పిన మనిషి ఎన్ని తిట్టగలడో అన్ని తిట్లు వడ్డించారు

ఈ సన్మానంతో రాజులో పేరుకున్న మైకం కాస్త తొలగిపోయింది మళ్లీ మనస్సు పనిచేయ సాగింది లోపలికి వెళ్లి చక్కగా మంచి విలువగల సూట్ వేసుకుని బయటకు వచ్చాడు

శాస్త్రిగారి కుటుంబం, రావు కుటుంబం, ఊళ్లోవాళ్లు కామజ్యోతిని కులట, పతిత అనీ, మాంసం, మద్యం సేవించిందని తిట్టివేశారు కామజ్యోతిమాత్రం తక్కువతిన్నదా! ఊళ్లో వాళ్లందర్నీ తన నోటికొచ్చినట్లల్లా, అసభ్యంగా బూతు

# యుద్ధభూమిపైన అపరాధపరిశోధక గాథ

మాటలతో తిట్టింది శాస్త్రిగారి కుమార్తె కులట అనీ, నిందించింది

ఈలోగా రాజు, లోపలనుండి బైటికి వచ్చాడు శాస్త్రిగారి కుమార్తె కులట అనీ, అందువల్లనే ఆమెను వదలి వేశానని, ఇలాంటి పాపాత్మురాలిని కట్టబెట్టి తనలాంటి పెద్దమనిషి పరువు తీసినందుకు పరువునష్టపు దావా వేస్తానని బెదిరించాడు కామజ్యోతి కూతలే కాకుండా, రాజుకూడా అదే మాటలు చెప్పటంతో శాస్త్రిగారు, తదితర్లు కొద్దిసేపు దిగ్భ్రాంతి పొందారు ఈ సందట్లో రాజా, దొడ్డిత్రోవగుండా ఎవరూ చూడకుండా చల్లగా బయటకు జారుకున్నాడు. కానీ అంతకు ముందు జరిగిన సంఘటనలో రాజు—గుడ్డలు చినిగి పోయాయి

కామజ్యోతి తిట్టటం ప్రారంభించగానే, అందరూ ఆమెపై చేయి చేసుకున్నారు ఒంటిమీద స్పృహ తప్పిపోయిందేమో అన్నంతగా చితక బాదేశారు ఈ దెబ్బలు భరించలేక ఆ అర్ధరాత్రి ఆ చీకటిలో కామజ్యోతి పారిపోయింది మిగిలినవాళ్లు ఆమెను, రాజును వెతుకుతూ నలుదిక్కులకు బయల్దేరి పోయారు.

ఎవరూ చూడలేదనుకుంటూ రాజు పారి పోయినా, జమీందారుగారి డ్రైవరు మాత్రం అంతా కనిపెడ్తూనే ఉన్నాడు తల్లిదండ్రుల బారి నుండి పారిపోతున్న కామజ్యోతి, తన కారు దగ్గరకు రాగానే ఆమెకు ఊరుబయట ఉన్న తన కుటీరంలో దాక్కోమని సలహా యిచ్చాడు కామజ్యోతి వెళ్లిపోయింది ఇంతలో కామజ్యోతిని వెతుకుతున్న వారు రాగానే వారికి ఇంకో దిక్కు చూపించి, కామజ్యోతికి అపాయాన్ని తప్పించి కొంతవరకు రక్షించాడు ఇంతలో రాజు కూడా తన కారు దగ్గరకు వచ్చాడు అతనికి డ్రైవరు, కామజ్యోతి ఎక్కడుందో చెప్పాడు

ఈలోగా రాజు పరుగెత్తుకుంటూ వెళ్లి కామజ్యోతిని కలుసుకున్నాడు తగిలిన గాయాలకు సానుభూతి చూపించాడు, ఓదార్చాడు ఆ అపాయ ప్రదేశాన్ని దాటిపోవాలన్న ఆదుర్దాతో వారిద్దరు ఆ అర్ధరాత్రి చీకటిలో అడ్డదారుల ద్వారా జమీందారుగారి తోటలో దాక్కున్నారు ఆ తోటలమాటుగా వాళ్లు ఆ ప్రాంతం దాటి నిర్జనమైన నడిరోడ్డు మీదకు వచ్చారు

ఇంతలో ఓ లారీ ఆ రోడ్డంబట వెళ్తూంటే దాన్ని ఆపుచేశాడు మాసి, చినిగిన దుస్తులతో ఉన్నవాళ్ల వంక ఆ డ్రైవరు అనుమానంగా చూశాడు తను, తన భార్య గౌరవప్రదమైన కుటుంబంకు చెందినవారని, త్రోవలో కారు-ప్రమాదంవల్ల తన భార్యకు గాయాలు తగిలాయని అబద్ధాలాడి, తమను దగ్గర్లో ఉన్న ఆస్పత్రికి తీసుకుపోవలసిందని అర్థించాడు సరే! ఆ లారీ డ్రైవరు వాళ్లను ఒక జిల్లా కేంద్రం ఆస్పత్రి దగ్గర వదలి, కిరాయి ఇచ్చినా పుచ్చుకోకుండా వెళ్లిపోయాడు

అప్పుడే తెల్లవారింది దగ్గరున్న ఓ మందుల అంగడికి వెళ్లి రాజు ప్లాస్టరు తీసుకొని కామజ్యోతి గాయాలకు పైన వేశాడు తను స్వయంగా మద్రాసు వస్తున్నందువలన తన వ్యవహారానికి సంబంధించిన కాగితాలన్నీ అలాగే ఉంచవలసిందని బర్మా కాన్సులేట్‌కు తంతివార్త పంపించాడు

రైల్వేస్టేషనుకు వెళ్లారు రాజు, కామజ్యోతి ఓ అరగంటలో మద్రాసు వెళ్లే ఎక్స్‌ప్రెస్ ఉందని తెలుసుకున్నారు రాజు దగ్గర ఇద్దరికి సరిపడిన డబ్బు లేదు అందువల్ల తనకు మాత్రం మద్రాసు ఎగ్మూర్ స్టేషన్‌దాకా మూడవ తరగతి ఎక్స్‌ప్రెస్ టిక్కెట్టు తీసుకుని, కామజ్యోతిని టిక్కెట్టు లేకుండానే రైలులో ఎక్కించాడు ఇద్దరూ మద్రాసు బయల్దేరారు

అది ఒకవిచిత్రమైన పరిస్థితి. ప్రేమికు లిద్దరూ ఒకే రైలులో ఒకరు టిక్కెట్టుతోను, ఇంకొకళ్లు టిక్కెట్టు లేకుండాను ప్రయాణంచేయటం చూస్తే నిజంగా జాలివస్తుంది ఒక విధంగా ఒక వ్యక్తి బర్మాదేశంలో ఒకపెద్ద ఉద్యోగి, ఇంకొక వ్యక్తి పేదకుటుంబంలో పుట్టి, గొప్పింట్లో పరిచారిక. పిల్లిద్దరూ ప్రేయసీ ప్రియులని, ప్రేమించారని ఏదో అనుకుని, పరస్థలానికి పారిపోతున్నారు ఇంత విషమ పరిస్థితిలోను చెక్కుచెదరని వ్యక్తి రాజు ఒక్కడే

ఎక్స్‌ప్రెస్ మనస్సుకన్నా వేగంగా దూసుకు పోతున్నది చుట్టుపట్ల రైలుస్టేషనులు మెరుపుల్లా కనిపించి మాయమవుతున్నాయి అంతకన్నా వేగంగా పరుగెడుతున్నాయి రాజు మనస్సులోని ఆలోచన్లు; వచ్చింది ఒకందుకు, చేసింది ఇంకో పని అంతా సవ్యంగా పకడ్బందీగా జరుగుతుందనుకున్నాడు అంతా ఆగం చేసుకొని వెళ్ళిపోతున్నాడు పైగా ఇప్పుడు తన వెంట వస్తున్న కామజ్యోతికి టిక్కెట్టు కూడాలేదు ఏం చెయ్యాలి ?

కామజ్యోతి కీ ఆలోచనలతో పనేమీ లేదు రాత్రి తగిలిన దెబ్బలవల్ల ఒళ్ళంతా వచ్చిపుండై దేమో, ఒంటిమీద స్పృహ లేకుండా పడి ఉంది మధ్యమధ్య ఆ నొప్పులు భరించలేకనో ఏమో మూలుగుతూఉంది

రైలు ఒక చిన్న స్టేషనుదగ్గర ఆగింది సాధారణంగా, ఎక్స్‌ప్రెస్‌బళ్లు ఆ స్టేషనులో ఆగవు ఇం చిన్న స్టేషనులో ఈ ఎక్స్‌ప్రెస్ ఆగటానికి కార మేమిటా అని కిటికీలోంచి బయటికి చూచి ఉలిక్కిపడ్డాడు రాజు!

బండి ఆగీ ఆగగానే, స్టేషనులోంచి బిలబిలలాడుతూ ఓ ఇరవైమంది టిక్కెట్ కలెక్టర్లు వారి అధికారి ఒకరు ఆ రైలులో ఎక్కారు ప్రతి పెట్టెలోనూ టిక్కెట్టు లేనివాళ్లను పట్టుకుంటున్నారు టిక్కెట్ కలెక్టర్లు ఎక్కగానే బండి బయల్దేరింది

ఇంతలో ఓ టిక్కెట్టు కలెక్టరు ఆపెట్టె వైపు రావటం చూశాడు రాజు కామజ్యో స్పృహతప్పి పడివుంది క్షణంలో పక్కపెట్టెనుండి ఆ టిక్కెట్టు కలెక్టరు రాజుఉన్న పెట్టెలో ఎక్కాడు అందరి టిక్కెట్లు తనిఖీచేసి రాజుదగ్గరకొచ్చాడు వచ్చాడు రాజు వెంటనే తన జేబులోఉన్న మూడ తరగతి ఎక్స్‌ప్రెస్ టిక్కెట్టు చూపించి, వెంట కక్కసులో జొరబడి తలుపేసుకుని బయట జరుగుతున్న తతంగమంతా వింటున్నాడు

ఆ పెట్టెలో ఇంక తనిఖీ చేయాల్సింది కామజ్యోతిని మాత్రమే టిక్కెట్ కలెక్టరు కామజ్యోతిని నిద్రలేపి టిక్కెట్ అడుగుదామనుకున్నాడు కానీ, వంటినిండా గాయాలతో, స్పృహలేకుండ మధ్యమధ్య మూలుగుతూ పడివున్న కామజ్యోతిని చూచి ఏమీ మాట్లాడకుండా పక్కపెట్టెలో

51వ పేజీ చూడండి

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి హైదరాబాద్‌లో మ్యూచువల్ బెనిఫిట్ ఫండ్ వార్షిక సర్వసభ్యసమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

# ఈ విపత్కర తరుణంలో "ఇంటి దొంగల" బెడద

వి. ఎల్. ఎస్.

ఒక్క చైనా దురాక్రమణతో ఎన్నో సమస్యలు వచ్చిపడ్డాయి. శత్రువుల్ని ఎదుర్కొని, మనదేశం లోంచి వెళ్లగొట్టటం ఓయెత్తు; 'ఇంటి దొంగల్ని' ఓ కంట కనిపెడుతూ, వాళ్లనుంచి ప్రమాదం రాకుండా కాపాడటం యింకోయెత్తు. వీళ్లు కేవలం, కమ్యూనిస్టు చైనాను పొగడుతూ, భారతావనిమీద దెబ్బతీసే ప్రముఖులు మాత్రమేకాదు. ఈ అసాధారణ పరిస్థితిని తమ స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటూ, అమాయక ప్రజలను దోచుకునే వర్గం కూడా. అందువలనే ప్రజారక్షణ సమితి ఏర్పాటయింది. దీనికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అధ్యక్షులు; ఈ సమితిలో వివిధ పార్టీలవారికి, వర్తక వ్యాపార సంస్థలకు, ఇంకా యితర పెద్దమనుషులకు స్థానం ఇవ్వబడింది. అన్ని రంగాల్లోనూ అధికోత్పత్తి సాధించడానికి, జాతీయ రక్షణనిధి వసూలు చెయ్యటానికి, దొంగ నిల్వలుచేస్తూ అధిక లాభాల కోసం ధరలుపెంచే పద్ధతిని అరికట్టటానికి, సైన్యాలకు సౌకర్యాలు సమకూరుస్తూ, వారి వారి కుటుంబాలకు తగు సహాయం చేయటానికి, ఈ సమితి పూనుకుంటుందని ప్రకటించారు. బాగానే ఉంది. రాష్ట్రవ్యాప్తంగా ఏర్పాటయిన ఈ సమితి, ప్రభుత్వ యాజమాన్యాన కొంతవరకు మంచి ప్రయోజనాలు సాధించటానికి అవకాశం లేకపోలేదు. అయితే ఈ ప్రయత్నంలో యెంతవరకు సఫలమయిందో చూడాలసి ఉంటుంది.

ఇది ఇట్లా ఉండగా, ఇంకో మంత్రివర్యుని అధ్యక్షతన, మరో కమిటీ ఏర్పడ్డట్టు వార్త తెలిసింది. హైద్రాబాద్ మేయర్ అధ్యక్షతన పౌర రక్షణ సంఘం, సికింద్రాబాద్ పురప్రముఖులతో మరో సంఘం; అట్లాగే హైద్రాబాద్ పురజనులతో ఇంకోటి, ఇవన్నీ చాలవన్నట్లు బస్తీబస్తీకి సిటిజన్స్ కమిటీలు, హైద్రాబాద్ జిల్లా మొత్తానికి సంబంధించిన యింకో కమిటీ ఇన్ని యేర్పడ్డాయి.

ఇన్ని రకాల కమిటీలు భారీయెత్తున వచ్చి, సామాన్య ప్రజల్ని రక్షించటం మొదలుపెడితే, వాళ్ళే మన్నా ఊపిరిసలుపుకోవాలా! ఉక్కిరి బిక్కిరయ్యి, ఆసాంతం, ఎక్కడివాళ్లక్కడ కూలిపోతారు! ఈ సంఘాలన్నీ చేస్తున్న కార్యకలాపా లేమిటి! ముఖ్యంగా జాతీయరక్షణ నిధికి డబ్బును వసూళ్ళు చేయటం; ఇంకా చెప్పుకోతగ్గ కార్యక్రమమేమీ కనిపించటంలేదు. కేవలం నిధి వసూళ్ళు చేయటానికి అయితే ఇంత హంగామా అక్కర్లేదు; ఇన్ని బాపతుల కమిటీలు శుద్ధ అనవసరం. వీటివలన కావలసిన సమన్వయం కుదరకపోవటం, చురుకుగా సాగాలసిన పనుల్లో జాప్యం కలగటం; పార్టీ రాజకీయాల్లో మునిగి తేలే పెద్దమనుషులకు పనులు కల్పించటానికి యిదేనా తరుణం? అదివరలో యీ ప్రముఖులు చేసిన మంచి పనులేవైనా ఉంటే, ప్రజలు మరిచిపోరు. ఏదో కారణంగా, వీళ్ళందర్నీ తీసుకువచ్చి ప్రజలకు పరిచయం చేయాలసిన అవసరమేమీ లేదు.

పంజాబు రాష్ట్రంతో పోల్చి చూసుకుంటే మన రాష్ట్రం జాతీయనిధిని వసూలు చేయటంలో చాలా వెనకబడిందనే చెప్పాలిగాని, లేకపోతే, ఈ విషయంలో కృషి బాగానే జరుగుతోందని చెప్పాలి. స్థానిక దినపత్రికలు రెండు, జాతీయ రక్షణ నిధిని వసూలు చేయటానికి పూనుకున్నాయి. రోజూరోజూ దాతల పేర్లు, వసూలు మొత్తం ప్రకటిస్తూ ఉంటాయి. సుమారు, రెండు లక్షలదాక వసూళ్లయినాయి. అనేక సాహిత్య, సాంస్కృతిక సంస్థలు కూడా ముందుకువచ్చి పనిచేస్తున్నాయి. నాటకాలు, నృత్యాలు, సంగీత కచేరీలతో, 'రవీంద్రభారతి' నిండా మునిగి ఉంది. పేరుపడ్డ కళాకారులు, దేశం నలుమూలల్నుంచి వచ్చి, నిధి వసూళ్లకు తోడ్పడుతున్నారు. పురప్రముఖులు కూడా ఉదారంగానే విరాళాలు యిస్తున్నారు.

ఇవన్నీ కాకుండా, స్టేట్ బ్యాంకుల్లో ధన రూపంగా గాని, బంగారం రూపంలో గాని, జాతీయ రక్షణ నిధికి వసూళ్ళ ఏర్పాటు ఉంది. నేరుగా ఢిల్లీకి పంపాలంటే మనియార్డర్ కమీషన్ లేకుండా, రూపాయి దగ్గర్నుంచి పంపటానికి సౌక కాశం కూడా ప్రతి పోస్టాఫీసులోనూ ఉంది. ఇన్ని రకాల వసతులున్నా కూడా కొంతమంది ఈ నిధి కోసం బయలుదేరి, వసూలైన మొత్తాల్ని స్వరక్షణకోసం ఉపయోగించుకుంటున్నట్టు తెలుస్తోంది. ఈ రాజధాని నగరంలోనే ఇట్లా ఉంటే ఇక పల్లెపట్టున ఏవిధంగా ఉంటుందో ఊహించ వచ్చు. అందువలనే, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం చేసినట్లు, ప్రభుత్వ అనుమతి లేనిదే ఎవరూ నిధిని వసూలు చేయకూడదని ఉత్తర్వు జారీచేస్తే మంచిదేమో అనిపిస్తోంది.

ఒక్క నిధి వసూలు చేయటంతో సరిపోతుందా! మిగతా విషయాల మాటేమిటి? ధరల పెరుగుదలను అరికట్టటానికి ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకున్నది? అధికోత్పత్తి సాధించటానికి ఏ విధమైన కార్యక్రమం తలపెట్టింది? జవాన్ల కుటుంబాలకు ఏవిధమైన సౌకర్యాలను కలిగిస్తోంది మొదలగు విషయాలమీద విస్పష్టంగా ఒక ప్రకటన చేయాలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉంది. కేవలం ఉపన్యాసాలతోనూ ఉద్బోధలతోనూ ఇవన్నీ సాధించాలంటే సాధ్యంకాదు.

ఇంకా 'ఇంటి దొంగలు' ఉండనే ఉన్నారు. వీళ్లు 'సోషలిస్టు' చైనాను ముప్పొద్దులా పొగడుతూనే ఉంటారు. ఇప్పటికీ వాళ్ల విశ్వాసం ఏమిటంటే, చైనా భారతదేశంమీద దురాక్రమణ చెయ్యలా అని. ఇప్పుడు చేసిందేమిటయ్యా అంటే మాట్లాడరు. మన దేశ సరిహద్దుల్ని కాపాడటానికి, ఒక్కుమ్మడిగా చేస్తున్న ప్రయత్నాలన్నింటిలోనూ, అడుగడుక్కీ ఏదో రకంగా అడ్డం వస్తూనే ఉంటారు. వీళ్ల ప్రచారం మహా జోరాన్నది. ఇలాంటి వాళ్లమీద తీసుకుంటున్న చర్యల కంటె తీసుకోవలసిన చర్యలే ఎక్కువ ఉన్నాయి.

ఈ దురాక్రమణను ఎదుర్కొనటానికి సామాన్య మానవుడు ముందుకు వచ్చినట్టు, శ్రీమంతులు, స్థితిపరులు అంత తేలికగా బైటపడటం లేదు.

52-వ పేజీ చూడండి

# దేశ రక్షణకై ఆయుధాలు
## ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే

ఎం. సరోజ

# సవరించుకోవలసిన కొన్ని లోపాలు

మన దేశంలో సాధారణంగా మగపిల్లాడు పుడితే పోనీలే అమ్మా, మగపిల్లాడే పుట్టాడు అంటారు మగపిల్లాడు పుట్టాడంటే ఎంతో గొప్పగా భావిస్తారు మన పెద్దలు అదే ఆడపిల్ల పుడితే ఏం ఆడపిల్లలు పోనిద్దురూ అనే వాళ్ల కొంతమంది, వీళ్ల పుట్టింది కాకుండ, ఆస్తి తరగ దీస్తారు అనేవాళ్ల కొంతమంది, ఆడపిల్ల పుట్టిందని ఏడ్చేవాళ్ల కూడ ఉన్నారు మన హిందువులలో ఆడపిల్ల లేకపోతే కాలచక్రం దొర్లదన్న విషయం ఎవ్వరూ గ్రహించలేరు

చదువుకున్న పురుషులలో కొంతమంది భార్యకిచ్చే గౌరవం ఇస్తూ అనురాగంతో ఆదరిస్తారు కొంతమంది చదువుకున్నప్పటికీ అజ్ఞానం వల్లనో, పురుషుడనన్న అహంభావం వల్లనో భార్యను మాటిమాటికి కారణం లేకుండా చిదరిస్తుంటారు అలాంటి వాళ్లను చూస్తే నాకు చాల అసహ్యమనిపిస్తుంది

నాకు తెలిసినవాళ్ల ఒకరున్నారు ఆ కుటుంబములో భార్య, భర్త, ముగ్గురు పిల్లలు ఆవిడ భర్త చదువుకున్నవాడైనప్పటికీ ప్రతిదినం ఏదో ఒక సాకుతో ఆవిడని ఎప్పుడూ "ఛీ, ఈఆడవాళ్లెప్పుడూ ఇంతే ఇంటి సంగతులే పట్టించుకోరు సినిమాలు, షికార్లు — ఇవి తప్ప అని కసురుతుంటాడు పాపం ఆవిడ ఎప్పుడు ఇంటిపని తెమలందే ఎక్కడికి వెళ్లేది కాదు అయినప్పటికి ఆయన కసురుకోవడం దినచర్యగా భావిస్తాడు ఆవిడ ఎప్పుడైనా "అబ్బ ! ఈ దినం చాల పనుంది ఒక నిముషం కూర్చోడానికన్నా తీరిక లేదు" అని తనలో తాను అనుకుంటుంది అన్నదే తడవుగా ఆయన "ఆడజన్మ ఎత్తిన తరువాత ఆ మాటనడానికి నీకు హక్కులేదు మేము చూడు ఇష్టం వచ్చినప్పుడు లేస్తాం తిరుగుతాం నీ కలాంటివేం కుదరవు" అంటూ హాస్యంలానే వెటకారంగా అంటాడు ఆ మాటతో ఆవిడ ముఖం చిన్నబుచ్చుకుంటుంది సున్నిత మనస్సు గల స్త్రీ అయితే అలాంటిపరుషవాక్కులకు ఏడ్చేస్తుందికూడ

లోభి అయిన భర్త అయితే మంచి బట్టలు కూడ కట్టనివ్వడు ఇలాగే మా ప్రక్కింటి ఆయన తను తినడు, ఒకరికి పెట్టడు ఉన్నదంతా బ్యాంకులో నిలువజేస్తాడు ఇంతా చేస్తే ఆయనకి పిల్లలు లేరు ఇదంతా ఎవరికోసం ?

మాకు దగ్గర బంధువులలో ఒకాయన భార్యను ప్రతి విషయంలోను అనుమానిస్తుంటాడు. ఆవిడ ఎప్పుడైనా రేడియో బిగ్గరగా పెడితే "ప్రక్కింటాయన వింటాడని అంత సౌండ్ పెడుతున్నావ్" అంటూ దెబ్బలాడి భోజనానికి రాజీనామా (అపూటకి) ఇస్తాడు పాపం ఆయనతోపాటు ఆవిడ కూడ లంకణం పురుషులు ఏ విషయంలో కసరుకున్నా పర్వాలేదు గాని, అనుమానిస్తే ఆ సంసారం నరకంకన్నా అధ్వాన్నంగా తయారవుతుంది స్త్రీలలో లోపం ఉన్నప్పుడు ఆవిడను అనుమానించినా సమంజసంగా ఉంటుందిగాని, పాపం ఈవిడ ఏ పాపం ఎరుగదు ఈవిడ మరదులు, బావలు మొదలైనవారెవరైనా వస్తే ఆవిడ మాట్లాడదు వాళ్లమీద కూడ అనుమానిస్తారనే భయం పాపం ఆవిడని చూస్తే జాలేస్తుంది దారిలో కనిపించే ఆడవాళ్లను నానా అల్లరి చేస్తారు పురుషపుంగవులు తమ అక్కచెల్లెళ్ళను కూడా పై మగాళ్ళు అలా చేస్తారేమో నన్న ఆలోచన ఏ ఒక్క సోదరునికి ఉండదు స్త్రీలు ఎదుటపడగానే తమ సోదరీమణులన్న భావన ఎవ్వరికీ కలుగదు ఓ పదిమందిలో ఒకరికి అలాంటి భావన కలిగినా, తక్కినవాళ్ళకు కలుగదు

చాలామంది పురుషులు స్త్రీలను కించ పరచడమంటే చాలా ఇష్టపడతారు ఆ విధంగా అవమానించుటవలన వాళ్ళు బాధపడతారన్న ఆలోచన రాదు. వచ్చినా లెక్కచేయరు కొంతమంది

ఇటువంటి చిన్నచిన్న లోపాలను పురుషులు సవరించుకుంటే స్త్రీలు చాలావరకు సుఖపడ గలుగుతారు 




## జరిగిన కథ

రామచంద్రపురవాస్తవ్యుడు ప్రసాదరావుగారి కుమార్తె నిర్మలను అజంతా విహారాలకు వస్తోండగా త్రోవలో కారు చెడిపోయి ప్రయాణంసాగక బాధపడుతున్న ఓ శేఖరర్ ఆయనభార్య రుక్మిణమ్మతో పరిచయం ఏర్పడుతుంది. రుక్మిణమ్మగారు నిర్మలను తన అక్కగారి కుమారుడు ప్రకాశ్ తోను, వసంతను శేట్ల హాశంలోని బడిపంతులుతో వివాహం జరుపిస్తుంది. నళినీ, కుసుమలకు కూడా ప్రసాదరావుగారు వివాహాలు చేస్తారు. కోడంటికం భరించలేని కుసుమను భర్త అనుమతిలో ప్రసాదరావుగారు ఇంటికి తీసుకువస్తారు ప్రకాశ్ కు మతిస్థిమితం తప్పగా బొంబాయి పిచ్చి ఆస్పత్రిలో చేరుస్తారు. రాజారావుగారు తమ తాతగారికి పిచ్చి ఉండేదన్న విషయాన్ని వెల్లడిస్తారు. భర్త వ్యసనాలకు లోనయ్యాడని విని కుసుమ ఆత్మహత్యకు పూనుకుంటుంది ఈ సంగతి విన్న సుబ్బారావు అన్నను ఇంటినుంచి వెళ్ళగొట్టి, భార్యదగ్గరకు బయలేర్దాడు. డాక్టరు శాంత నిర్మలకు తనగాధ చెప్తుంది. నిర్మల చెల్లెలు వసంత చనిపోతుంది రాధ అనే ఓ దిక్కులేని అమ్మాయి బిడ్డను నిర్మల పెంపడానికి తీసుకుంటుంది. వసంత భర్త శ్యామలఅనే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడని, తమ్ముడు రామువల్ల నిర్మల తెలుసుకుంటుంది. శ్యామల నిర్మల పుట్టింటికివచ్చి తన గోడు వెళ్ళబోసుకుంటుంది

## 13

నిర్మలను దింపుకునేందుకు డ్రైవరు కారుతో వచ్చాడు బండి దిగగానే అన్నాడు "అమ్మగార్కి మూడురోజులనుంచి వుస్తీగా ఉంది. పడకలో ఉన్నారు"

పిడుగులాంటి యీ వార్త వినగావే నిర్మల కెంతో గాభరావేసింది ఇల్లుచేరగానే మాలతి యెదురొచ్చింది పాలిపోయిన ముఖం, నిద్రలేక భారంగా ఉన్న కళ్ళు, ఆకళ్లలోనిఆవేదనను చూచి నిర్మల భయపడింది హమ్మయ్య వచ్చేశావు అన్నట్లు చూచింది మాలతి.

"ఎప్పటినుంచి ? నాకు ముందుగానే తెలిపేలేదెందుకని ?" నిర్మల అంది

"వెళ్ళక వెళ్ళక వెళ్ళావు— ఎప్పుడూ వచ్చేదలానే వచ్చింది— అందుకని రాయలేదు కాని, వదినా ! అమ్మకు నిన్న సాయంత్రంవించి అనలేమీ బాగ లేదు"

నిర్మల సావిత్రమ్మమంచందగ్గర కూచుంది డాక్టర్ శాంత యిన్నో యింజక్షన్లు గుచ్చుతోంది కానీ, ఆమెలో చలనంలేదు మూసిన కన్ను తెరవలేదు గంట, రెండు గంటలు గడిచినై డాక్టర్ శాంత నాడి పరీక్షిస్తూ కూచుంది ఇంకో గంట గడిచింది. ఆ గదిలోని వ్యక్తులు లోకాన్ని మరచిపోయినట్లున్నారు

సావిత్రమ్మ పెదాలు కొద్దిగా కదిలినై— చిన్న మూలుగు విన్పించింది— అతి ప్రయత్నంతో కళ్ళు తెరచింది నిర్మల చెంచాతో ఆమె పెదిమలు తడుపుతోంది సావిత్రమ్మ కోడలివైపు కొన్ని క్షణాలు చూచింది తర్వాత రెండోప్రక్క కూచున్న మాలతికేసి చూస్తుండిపోయింది ఆమెముఖం బాధతో, అవ్యక్తమైన క్షోభతో వేయివంకరలు

—45 వ పేజీ చూడండి




## చదువుతున్నవారికేనా గర్వం?

అసలు నా దృష్టిలో చదువుకొన్న స్త్రీలకు ఏమాత్రం గర్వం ఉండదని కాన మన స్త్రీలు ఎదుటివారి గొప్పను గుర్తించి కూడ అభినందించ లేక "ఎంత గర్వమో" అని తేల్చేస్తారు సాధారణంగా అది మనలో ఉన్న హృదయ దౌర్బల్యతే కాని మగవారిలో ఆ గుణం లేదు చదువుకొన్న అమ్మాయిని చూసినప్పుడు వారిని గూర్చి గొప్పగా చెప్పి అభినందిస్తారు. కాని మనలో ఆ శక్తి లేక, ఇతరుల విద్యను, గొప్పను ఓర్చుకోలేక "ఆవిడకు ఎంత గర్వం" అని అనేస్తాం

పి సౌభాగ్యవతీకృష్ణ (భీమవరం)

* * *

అసలు బాగా చదువుకున్నావిడ పేరంటాలకు, పార్టీలకు ఇలాంటివాటికి వెళ్లినప్పుడు అక్కడ ఉన్నవాళ్లంతా (మాటలు తక్కున ఆపేసి) ఈవిణ్ణి ఓ వింత జంతువును చూసినట్లు చూస్తారు. ఒకవేళ కలిసిమెలిసి ఉండాలన్నా, ఈవిడ కెలా సాధ్యమవుతుంది ? మా ఇంటిదగ్గర ఒకావిడ ఉంది వాళ్లమ్మాయి ఏమంతగా చదువుకోలేదు ఇక ఆవిడకు రోజూ చుట్టుపక్కల చదువుకుంటున్న వాళ్లందర్నీ వర్ణించడం, ఆ అమ్మాయిని కించపరచడమే పని ప్రత్యక్షంగా ఆ అమ్మాయిని తిడుతున్నప్పటికీ, పరోక్షంగా చదువుకునేవారిని హేళన చేయుటమే పని నా ఉద్దేశ్యం

శ్రీమతి డి నగరాజ్యలక్ష్మి (తెనాలి)

* * *

నాగరికత సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతున్న ఈ నవనాగరిక యుగంలో కూడ చదువుకున్న స్త్రీలంటే అందరికీ చులకనే చదువుకున్న స్త్రీలపై దురభిప్రాయాలను వెలిబుచ్చేవా రందరికీ ఈ వ్యాసం ఒక గుణపాఠం నేర్పుతుంది చదువుకున్నవారిలో కొందరికి గర్వం ఉన్నది లేదనడంలేదు కాని "తా జెడ్డ కోతి వనమెల్ల చెరిచిందని" ఏ కొందరు యువతులకో గర్వం ఉన్నదని విద్యావంతులైన యువతు లందరికి గర్వం ఉన్నదని ఆరోపించటం అన్యాయం.

కుమారి జి జయశ్రీలక్ష్మి (గుంటూరు)

* * *

శ్రీమతి ఆటవర్తి కృష్ణవేణిగారు తలచినట్లు వ్యాసాన్ని సంపూర్తిగా విమర్శించడం ఈ వనితా వాణి శీర్షికలో కష్టము అలా కనుక విమర్శిస్తే అది మళ్లీ ఒక వ్యాసం అవుతుంది వనితావాణి శీర్షికలో వేయనూ వేయరు ఈ ఉత్తరాలకు కూడా ఇంత స్థలమే ప్రత్యేకించారు కదా ఆటువంటప్పుడు అది ఎలా కుదురుతుంది ?

ఏ బాల (బెంగుళూరు)

* * *

ఈ వారం వనితాలోకంలో లక్ష్మిగారి వ్యాసం చదివాను గర్వం అనేది కేవలం చదువుతోనే రాదనే విషయం నేను ఒప్పుకుంటాను కానీ, రచయిత్రిగారు తాను బి ఏ చదివినందువల్ల అందరూ తనకు గర్వం అన్నారని తెలియజేశారు అయితే ఈ కాలంలో ఈ డిగ్రీలు ఒక పెద్ద చదువుకింద రావు ఎందుకంటే ఇప్పుడు అందరూ పెద్ద పెద్ద చదువులు చదువుతున్నారు అందువలన రచయిత్రి, బి ఏ చదివినంతమాత్రాన వారికి గర్వం అనుకోవడం పొరపాటు అయినా రచయిత్రి తనను పరిచయం చేసుకోవడంలో కాస్త గర్వం చూపించారనే చెప్పాలి

"ఒక డాక్టరుగారి చిన్నమ్మాయి" బి ఎస్ సి. (చెన్నూరు)

* * *

అసలు నా ఉద్దేశంలో గర్వం అన్న పదం ఒక్కొక్కరి మనస్తత్వంపై ఆధారపడి ఉంటుంది. కాని చదువుకున్నందువలన గర్వం ఉండదు. ఒకసారి మా ఊళ్లో పేరంటం జరిగితే నేనూ, మా అమ్మగారూ, చెల్లెలూ మా పక్కింటావిడ కలిసి వెళ్లాము మా వదినె చెల్లెలూ, నేనూ, కలిసే చదువుకున్నాంలెండి అప్పుడు అది ఎస్ ఎస్ ఎల్ సి, నేను థర్డుఫారం చదువుతున్నాను ఆరోజు పేరంటానికి దానికి జ్వరం వచ్చుట వలన రాలేదు మా అమ్మగారు పళ్లు తీసుకుని తొందరగా ఇంటికి వెళ్లారు. అమ్మ ఇంటికి వెళ్లాక ఆవిడ 'మీ కనకం రాలేదేం?' అని అడిగింది. 'జ్వరం వచ్చింది రాలేదు' అన్నా

ఇంతలో మా పక్కింటావిడ కల్పించుకుని 'జ్వరం లేదు; ఏమీలేదు. మధ్యాహ్నం కూడా స్కూలు కెళ్లింది చదువుకుంటోంది కదూ గర్వం; పేరంటానికి వచ్చి పసుపు పూసుకుంటే నామర్దా' అంది నా మొహాన్నే

'స్కూలునుంచి వచ్చేటప్పటికి వచ్చిందండి' అన్నాను; ఏం చెప్పాలో తెలియక గర్వం అనేది చదువుకున్నందువలన రాదు; చదువు లేనందువలన రాదు అది ఒక్కొక్కరి స్వభావం

జి అలివేలు మంగతాయారు (పొన్నూరు)

## 'శ్రీవారితో చెప్పకూడనిదేమిటి?'

'శ్రీవారితో చెప్పకూడని దేమిటి?' అది అక్షరాలా నిజం అనిపిస్తున్నది ఒక్కొక్కసారి ఒక మాటచేత జీవితాంతం దుఃఖమయం అవుతుంది

ఎం వెంకటనర్సు (పర్లాకిమిడి)

* * *

వ్యాసం చాలా బాగున్నది పత్రికద్వారా వారికి నా అభినందనలు.

ఎం రంగనాయకి (పర్లాకిమిడి)

* * *

పెండ్లిచేసుకొని, సంసారం చేసుకుంటూ పాత సన్నియును తిరగవేసుకోటం తెలివితక్కువతనం. శ్రీవారి మనస్సు చూచి మసలుకుంటే శ్రీమతికి చీవాట్లు ఉండవు. ఈ వ్యాసం చదట నేనొక సంగతి వ్రాస్తున్నాను.

నాకు తెలిసిన ఒక అమ్మాయి వాళ్ల దూరపు బంధువుల అబ్బాయిని ప్రేమించింది కానీ కట్నం ఆశలవల్ల ఆ అబ్బాయికి వివాహం జరగలేదు. ఇప్పటికీ ఆ అమ్మాయి తన భర్తతో ఆ అబ్బాయి గురించి పొగుడుతూ ఉంటుంది కానీ ఆ భర్త చాలా మంచివాడు ఆమెని బాగా చూస్తాడు ఈ వ్యాసం చదివిన తరువాత ఇలాంటివారు దారిలోకి వస్తారనుకుంటాను.

శ్రీమతి సుబ్బారావు (న్యూఢిల్లీ)

* * *

కాని నాకు ఒక సందేహము శికలేస్తారన్న భయంతో విషయం చెప్పకపోతే తెలిశాక మరీ ప్రమాదం అవుతుందేమో ?

పెదప్రోలు సుశీల (ఎనమలకుదురు)

* * *

క్రొత్తగా కాపురాలకు వెళ్ళిన కాంతలకు, ఈ వ్యాస పఠనమువల్ల, ఎంతయినా ప్రయోజనము ఉన్నది. రచయిత్రిగారు ఈ వ్యాసంలో పొందుపరచిన విషయాలన్నింటిని, మనం నిత్యమూ అనేక సంసారాలలో ప్రత్యక్షంగా చూస్తూనే ఉంటాము. అట్టి వారందరికీ, ఈ వ్యాసం సరియైన మార్గాన్ని చూపించగలదు ఇటువంటి రచనలు వనితాలోకానికి ఎంతైనా అవసరం—

శ్రీమతి యల్ వి యల్ యస్ శాస్త్రి (గుంటూరు)

* * *

భర్తతో సమయాసమయాలను గుర్తించి ఎలా మాట్లాడాలో ఆవిడ వ్యాసంలో బాగా తెలియచెప్పారు

పమ్మి వెంకటలక్ష్మి (మొయ్యేరు)

* * *

స్త్రీ పురుషుల్ని రెండు వేర్వేరు (వగ) జాతులుగా విడదీసి చిత్రిస్తున్న నేటి వ్యాసాల ప్రవాహానికి పార్వతీదేవిగారి వ్యాసం చక్కని వంతెనలా అనిపించింది మాకు

శ్రీమతి జయంతిలక్ష్మి, కుమారి పార్వతి (ఖర్గపూరు)

## సిటీలో సినిమాలు

"సిటీలో సినిమాలు" అన్నవ్యాసంపై శకుంతలాశర్మ (ఈరోడు)గారు వ్రాసిన విమర్శ చదివాము అదేమంత సమంజసముగాలేదు ఎందువలనంటే ప్రతి రోజూ వంటయింటి జీవితానికి అలవడ్డ స్త్రీలు ఏదో ఒక్కరోజు తాత్కాలికానందం కొరకు సినిమాకు వెళ్ళడం సహజం అలాంటప్పుడు "అసలు చూడకపోతే నేమి? నారీలోకం చెడ్డది" అని వ్రాయటం ఏం బాగుంటుంది జనం తగ్గినతర్వాత వెళ్ళచ్చుగా అన్నారు గాని హైదరాబాదు నగరంలో సినిమాలకు "రష్" కొద్దిగా ఎక్కువగానే ఉంటూందని గ్రహించలేకపోయారు

రాజశ్రీ (గుంటూరు)

* * *

## విమర్శ

కుమారి అయ్యగారి సూర్యకాంతం (రాజమండ్రి) గారు వ్రాసిన విమర్శ పట్టి తప్పు నేవింతవరకు వనితాలోకంలో అనేక వ్యాసాలు చదివాము అందులో ఎప్పుటకూడ పురుషుని కించపరచలేదు పురుషునిలో కూడ అనేక అవలక్షణాలు ఉన్నాయి వాటిని విమర్శించుటకు స్త్రీకు సర్వాధికారాలు కలవు. స్త్రీలు వ్రాసిన వ్యాసములలో వారే ఇంకా స్వాతంత్ర్యము తగ్గించుకొని వ్రాయుదురు కాని పురుషునిపై అధికారము చలాయించునటుల ఎక్కడా లేదు

ఆర్ సుబ్బారావు (వాల్తేరు) ★

## కుమారి కళ-14 బొమ్మల కథ 'దేవిక'

తిరిగి వచ్చేముందు 'కళ' సురేష్ కి క్షమాపణ చెప్పుకుంది.




సురేష్ వెళ్ళిపోయేకా ... చాలా బాధపడింది కళ




ఏదో పాటలకని ఛందస్సులు, రాగాలూ చదువుతుంటూంటేన పనిలోనే మగ్నమై పోయింది



ఏ పని చేస్తున్నా కళకు మనస్థిమితం లేదు




కాశిల్లన పాటల గురించి ప్రఖ్యాత సమీక్షకులు వ్రాసిన రివ్యూలు వచ్చేయి




కళ పాటలు రికార్డులు విపరీతంగా జనాన్ని ఆకర్షిస్తున్నాయి





కళాప్రపూర్ణ థియేటర్సువారి "ఇరుగు-పొరుగు"లో ఇ. వి. సరోజ.



వాహినివారి మొదటిచిత్రంలో క్రొత్తనటి స్వర్ణ-పద్మనాభం.

## కృష్ణార్జున యుద్ధం

జయంతివారి భారీ పౌరాణిక చిత్రం 'కృష్ణార్జున యుద్ధం'లో రామారావు, నాగేశ్వరరావు, సరోజాదేవి, వరలక్ష్మి మున్నగు ప్రఖ్యాత తారాగణం నటిస్తున్నారు. దీని మాటలు, పాటలు పింగళి కూర్చగా, దర్శకత్వం కె. వి. రెడ్డి వహించుతున్నారు. త్వరలో విడుదలకు సన్నాహ ము తున్న ఈ చిత్రంలో సెట్టింగులు హంగులు ఎక్కువగా ఉండొచ్చును.

## పెంపుడు కూతురు

పద్మినీ పిక్చర్సువారి "పెంపుడు కూతురు"లో రామారావు, దేవిక, రేలంగి లతోపాటు హరనాథ్ కూడా నటిస్తున్నాడు. ఈ చిత్రం కూడా జనవరి రెండోవారంలోనే విడుదలవుతుంద నుకుంటున్నారు.



పద్మచిత్రావారి "సవతికొడుకు"లో గిరిజ.

## చిట్టి తమ్ముడు

విజయగోపాల్ ప్రొడక్షన్సువారి 'చిట్టి తమ్ముడు' చిత్రం త్వర త్వరగా తయారవుతున్నదని, దీని కథకు "ఆలివర్ ట్విస్ట్" ఆధారమని తెలుస్తోంది.

దీనికి లిటక్ దర్శకత్వం వహించగా, పెండ్యాల సంగీతం కూర్చుతున్నారు. ఇందులో జగ్గయ్య, దేవిక అతిథి తారలుగా వేస్తున్నారు. కాంతారావు, రమణారెడ్డి, రాజనాల, రాజసులోచన, సంధ్య ప్రభృతులు నటిస్తున్నారు.

## ఇంకా అవీ-ఇవీ

ట్రిక్ సీనులతో నిండిన మురళీ ఫిలింస్‌వారి "మహాభారతం", (రచన: శ్రీ శ్రీ) ఈ నెల విడుదల అవుతుందని తెలుస్తోంది. స్వాతి ఫిలింస్‌వారి 'చూడ కోతే చుప్పారే' చిత్రం (జమున, కళ్యాణ్ కుమార్)

లక్షలాది జనులకు ఆనందం కలిగించే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో
ప్రకటనలు వేసి మీ వ్యాపారాభివృద్ధి చేసుకొనండి.

## జరిగిన కథ

నిచుళ నగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరిని అర్ధరాత్రి కలుసుకోవచ్చిన రంగనాయకుడు, కావలివారిని గాయపరిచిపోతాడు మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం హేమసుందరిని వలచిన తన ప్రియుడు తిరుమలరెడ్డికి చెబుతుంది. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేస్తుంది. రంగనాయకుడు హేమసుందరి శ్రీరంగం పారిపోతారు తనని గాయపరచవచ్చిన సింహాచలాన్ని చంపివేస్తాడు విశాలనేత్రాల మొక్కు చెల్లించి వస్తుండగా హేమసుందరీ రంగనాయకులకు రామానుజ యతీంద్రుల దర్శనం కలిగి గాఢాభిమానంగా మారి అంతేవాసులకు అసూయ రేకెత్తిస్తుంది యతీంద్రుని దయవల్ల రంగనాయకునికి విశాలనేత్ర దర్శనం కలుగుతుంది. రంగనాయకునిలో మార్పు గమనించిన హేమసుందరి రామానుజులను సందర్శిస్తుంది రామానుజుల పూర్వవృత్తాంతం తెలిసిన అంతేవాసులకు హేమసుందరీ రంగనాయకుల సాన్నిహిత్యంతో ఆందోళనకలిగి కొంతమంది మఠంవిడిచిపోతారు మఠాధిపతి యజ్ఞమూర్తి రంగనాయకుని నొప్పిస్తాడు రామానుజులు రంగనాయకునకు అష్టాక్షరీ మంత్రోపదేశం చేస్తారు.

## 28

దేవాలయావరణంలో కళ్యాణమంటపంలో పరమాశ్చర్యంతో సుదీర్ఘ ప్రసంగం కొనసాగించిన పిమ్మట యజ్ఞమూర్తికొక వినూతన ప్రపంచంలో ప్రవేశించినట్టయింది! తానింతకు మునుపు హేమసుందరీ రంగనాయకులన్న అధమాధములీ లోకంలో ఇంకెక్కడ గోచరించరని విశ్వసించుకొన్నాడు! అందువల్లనే వారిద్దరియెడల ఎడతెగని హేయదృష్టి అలవరుచుకొన్నాడు! కాని పరమభక్త శిఖామణులు, సత్పురుషులు అయిన శ్రీవైష్ణవు లెవ్వరికి లభించని శ్రీరంగేశుని సువిశాల సహజ దివ్యనేత్రాల సాక్షాత్కార సంపత్తి రంగనాయకుని కవలీలగా చేకూరినదని ఆచార్యులే అన్నారు! అంతేకాదు మల్లవిద్యలో ఏకాగ్రతకూడా అతని కా విషయంలో ఎంతో తోడుపడినదని ప్రశంసించారు! స్వయంగా వారిద్దరికి అష్టాక్షరీ మంత్రోపదేశం ప్రసాదించారు! వారి అనురక్తి, అన్యోన్యత అనన్యసాధారణాలని ప్రశంసించారు! ధర్మాధర్మాల ప్రసక్తి తెచ్చినప్పుడు శ్రీరంగశాయి సంకల్పబలమే తన నడవడి కాలంబనమని విస్పష్టంగా వ్యాఖ్యానించారు! ఆ ప్రసంగం విన్న పిమ్మట శ్రీవైష్ణవ

39–పేజీ చూడండి



మళ్ళా 'మోతీ' తిరిగివచ్చింది!' అన్నాడు శేఖరం ఆరోజు సాయంకాలం గ్రంథాలయంలో కలుసుకున్న మిత్రుడు సుధాకర్‌తో

'హమ్మయ్య! వచ్చిందికదా' అన్నాడు సుధాకర్, శేఖరం పక్కనే ఖాళీగాఉన్న కుర్చీలో కూర్చుని ఎదురుగాఉన్న కుర్చీలో కూచుని ఏదో పుస్తకం చూస్తూన్న మరో మిత్రుడు మాధవ్, కొంచంగా వంగి, సుధాకర్ గడ్డంపట్టుకుని, ముఖంపైకెత్తి అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ— 'ఒరేయ్! నాన్నా! ఏది తిరిగివచ్చిందని మన్వనుకోవడం?' అనడిగాడు

'అదే మొన్న ఇంట్లోంచి పారిపోయింది, వాళ్ళ పెంపుడు కుక్క 'మోతీ', దాని సంగతేగా' అన్నాడు సుధాకర్ అసలు విషయం బోధపడక

'అబ్బే! అదికాదు అది ఎటుపోయిందో పేరు వాళ్ళకెరుక కానీ, దానిమీద వీడు రాయలేదూ— 'మోతీ'—అని కథ, దాని సంగతి వీడంటూంట తిరిగి వచ్చిందట' అని అసలు విషయం విశదం చేశాడు మాధవ్

'మనం రాసిన కథలు తిరిగి రావడం అనేది కొత్త విషయం కాదుగా తను ప్రత్యేకంగా చెబుతూంటేనూ నిజంగా వాళ్ళ కుక్క తిరిగి వచ్చిందనుకొన్నా' అన్నాడు సుధాకర్

'మొట్టమొదట వీడితో చెప్పినప్పుడు వీడూ అలాగే అనుకున్నాడు' అని, శేఖరం మాధవ్‌వేపు చూసి చిరునవ్వు నవ్వుతూ— 'వాడు సరే మొన్నీ మధ్య తిరిగివచ్చిన కథను మళ్ళా తిరగరాస్తూ ఆలోచనలో ఉండటంవల్ల అపార్థంచేసుకున్నాడనుకో, మరి నీకేమొచ్చింది జబ్బు?' అన్నాడు సుధాకర్‌తో

'నేనూ అదే ప్రయత్నంలో ఉన్నాలే' అన్నాడు సుధాకర్

'మర్చేను నీ— 'వేయి బుడగలు'— తిరిగివచ్చింది కదూ' అన్నాడు శేఖరం

'కాస్తాకూస్తా రచనా ఏమున్నానా? ఓ చిన్నస్పైజు కేలంత ఉంటుందాయె!' అన్నాడు మాధవ్

'అంచేతే ఈసారి వాల్యూమ్ తగ్గేట్టుగా కుదించి వ్రాస్తున్నాను, పోస్టల్‌ఖర్చులుకూడ తగ్గుతాయని' అన్నాడు సుధాకర్

'అరేయ్! పోస్టల్ ఖర్చులంటే గుర్తుకొచ్చింది ఈ మధ్య 'బుక్‌పోస్ట్'కి కూడ 'డబ్బే' దొరకటం లేదురా మహాకటకటగా ఉందిసుమా!' అన్నాడు మాధవ్

'ఏం? మీ ఇంట్లో వాళ్ళుకూడ నిన్ను చిల్లర కొట్టుకూ కూరగాయలు, తేవటానికీ పంపించటం మానేశారా?' అనడిగాడు శేఖరం

'అలా పంపినప్పుడు తృణమో పణమో మిగుల్చుకొంటున్నానని ఓ దుర్ముహూర్తాన వాళ్ళకి తెల్సిపోయింది' అన్నాడు మాధవ్

'నాన్నలూ! అవన్నీ గతించిన స్మృతులు అవన్నీ ఎందుకు తిరగ తోడుకొంటారు ఆరోజుల్లో మార్కెట్‌కి పంపినప్పుడూ, బజార్లో ఏవైనా వస్తువులు కొనుక్కు రమ్మని పంపినప్పుడూ, డబ్బులు మిగలచూచుకొని, వాటితో ఎంచక్కా రచనలు పత్రికలకి పంపుకొనే వాళ్ళం ఇప్పుడా ఛాన్సు పోయింది నా బదులు ఇప్పుడు మా తమ్ముణ్ణి బజారుకి పంపుతున్నారు మా ఇంట్లోవాళ్ళు' అన్నాడు బాధగా సుధాకర్

'మా ఇంటోకూడ అంతే! కాని మా తమ్ముడు నా తల్లో దూరిపోయాడు వాడూ ఎలాగో అబద్ధాలో నుబద్ధాలోఆడి పావలో అర్ధో మిగుల్చుకొంటూనే ఉన్నాడు' అన్నాడు శేఖరం

'అదేనా! మీ తమ్ముడూ, మా తమ్ముడూ కలిసి రోజు కో గాలిపటం కొని ఎగరేస్తుంటే ఎక్కణ్ణుంచి వచ్చాయా వీళ్ళకి డబ్బులనుకొన్నా—అసలు రహస్యం ఇదన్నమాట' అన్నాడు సుధాకర్

'ఒరేయ్! మనవాడు సామాన్యుడా? వాళ్ళ తమ్ముడు మిగుల్చుకొన్నదాంట్లో వీడు సగం కొట్టేస్తున్నాడు' అంటూ శేఖరం—గుట్టు బయట పెట్టాడు మాధవ్

'అరె నీ కథ పత్రికలో పడా! మీ తమ్ముడి కమిషన్ వ్యాపారంలో నీ బ్రోకరేజి కూడానా?' అన్నాడు సుధాకర్ విస్తుపోతూ

'ఒరేయ్! మొన్నమేమైందో తెల్సా! మా తమ్ముడు ఓ పావలా కాసు ఎగరేస్తుంటే— ఇదెక్కడిదిరా మారని పావలా నీ దగ్గరుంచుకున్నావ్! ఇలా తేమ్మా, నే మార్చేస్తాను' అని వాడి దగ్గర్నుంచి తీసుకున్నాను ఇంతవెధవ! ఎక్కడ తెలివివాడిదే నేను తన దగ్గర పావలా కాసు తీసుకున్నానని వాడు మా నాన్నకి ఫిర్యాదుచేశాడు 'గాడిదా! నేను మంచిపావలా వాడికి ఇస్తే— మారదని తీసుకుని వాణ్ణే మోసం చేస్తావా?' అంటూ మా నాన్న నన్ను నానా చివాట్లుపెట్టారు ఏమని చెప్పన్లే ఇలా ఉంది మన స్థితి' అంటూ శేఖరం విచారంగా మొహంపెట్టాడు

ఇంతలో లైబ్రరీలో పనిచేసే కుర్రాడు అటువేపుగా వచ్చి, 'మీరు చివాట్లుతింటం అలా ఉంచి, ఇంకొంచెంసేపు ఇక్కడ ఇలానే మాట్లాడుతూ కూర్చున్నారంటే లైబ్రేరియన్‌చేత మీకంటే ముందు నాకు చీవాట్లు తప్పవు గమ్ముగా కూర్చుంటే కూర్చోండి లేకపోతే బైటికి వెళ్ళి మాట్లాడుకోండి బాబూ!' అంటూ అభ్యర్థన వోటి పారేసి వెళ్ళిపోయాడు

ఇంకా ఏదో మాట్లాడుకోవల్సిన విషయాలు మిగిలిపోయినట్లుగా ముగ్గురూ గ్రంథాలయం లోంచి బయటికొచ్చి దగ్గరలోనే ఉన్న పార్కువేపు నడిచారు

'ఏంటి! మాధవ్ ఇవాళ అదోకరకంగా ఉన్నాడు? అన్నాడు సుధాకర్ శేఖరంతో పార్కులో గడ్డిమీద తాపీగా కూర్చుని

'ఏంలేదు వాడు మొన్న పంపిన—'తిరిగిరానిది' అనే కథను త్రిప్పిపంపడానికి తగినన్ని స్టాంపులు కవర్లో పెట్టి పంపిందిలేందీ సరిగాగుర్తులేదుట అది నిజంగా తిరిగిరాదేమోనని వీడి విచారం' అన్నాడు శేఖరం దానికి సుధాకర్ భూమండలం బ్రద్దలయ్యేలా నవ్వి—

'ఒరే మై డియర్ మాధవ్! నీ కా భయమేమీ అవసరంలేదురా స్టాంపులు జతపర్చి పంపకపోయినా, నే నీ మధ్య పంపిన కొన్ని కథలు వెనక్కి వచ్చేశాయ్! నీ కథకూడ వెన్వెంటనే వచ్చేస్తుంది భయపడక—' అని నాలిక కొరుక్కుని,— 'అంటే నీ కథ తిరిగిరావటం నా వాంఛితం కాదనుకో. అయినా నీ శాటిస్ఫాక్షన్ కోసం చెబుతున్నా!' అంటూ పూర్తిచేశాడు.

'ఇక్కడ రాతపత్రికవాళ్ళంతా అడిగి తీసుకుని మరీ వేసుకుంటున్నారుకదా మన కథలు పత్రికల వాళ్ళు త్రిప్పిపంపుతా రెంచేతంటావ్?' అని ఎన్నాళ్ళనుంచో మనసులో ఉన్న అనుమానం బయట పెట్టాడు మాధవ్!

'ఏ విద్య నేర్చుకొన్నా ఓ గురువంటూ ఉండాలన్నారు అందుకనే ఇప్పుడు చూడు నీ కీ సందేహం వచ్చిందా. ఈ సమయంలో ఓ గురువుగారు గనుక ఉన్నట్లయితే ఎంచక్కా నీ సందేహం తీరిపోను' అన్నాడు సుధాకర్

'మహా మహా చెప్పేవిటో చెబుతున్నావ్‌కాని, ఏకలవ్యుడు ఏ గురువుదగ్గర విద్యనేర్చుకొన్నాడని అంత గొప్పవాడయ్యాడంటావ్?' అని ప్రశ్నించాడు మాధవ్.

'అతనుకూడ ఎవర్నో ఒకర్ని గురువని అనుకునేకదా విలువిద్య నేర్చుకొన్నాడు!' అని సమర్థించుకొన్నాడు సుధాకర్

'ఒరేయ్! గురువంటే గుర్తుకొచ్చింది ఈ మధ్య భాస్కరంగాడు చాలాఅరుదుగా కనబడుతున్నాడే! ఎప్పుడైనా కనబడ్డా, చాలా ముక్తసరిగా మాట్లాడుతున్నాడు మనమంటే ఏమన్నాకుళ్ళు పడిందా?' అంటూ శేఖరం తన సందేహం బయట పెట్టాడు

'భలేవాడివిరా మనమంటే వాడికి కుళ్ళెందుకు?' అన్నాడు సుధాకర్

'మన కథలన్నీ తిరిగివచ్చేస్తున్నాయని'

'కుళ్ళంటే మన కథలు తిరిగివచ్చిందానికి వాడు సంతోషిస్తాడు అంతేగాని ఏడుపెందుకూ?' అన్నాడు సుధాకర్

'అదికాదురా మనం ఈ మాత్రమన్నా వ్రాసి పంపుతున్నాం వాడు అదీ వ్రాయలేదుగా పంపే టప్పుడేమో రెండో కంటివాడికి తెలీకుండా పంపుతామయ్యె మనం తిరిగిరావడం వాడి కళ్ళలో పడక తప్పదుగా ఎప్పుడూ ఆ పోస్టాఫీసుదగ్గే కాపేసి చస్తాడయ్యె మనవి ఇన్ని కథలు తిరిగివచ్చేస్తుంటే— 'అమ్మో! ఇన్ని కథలు రాసేస్తున్నారా వీళ్ళని వాడికి ఏడుపుగా ఉండదా అని నే ననేది' అన్నాడు శేఖరం

'నువ్వన్నది నిజమే కాని వాడు మనల్ని చూసి కుళ్ళుకునేది ఏమీ ఉండదని నా అభిప్రాయం ఎంచేత నంటావా? మన వారపత్రిక— "ఆకలి"కి వాడు ధారావాహిక నవల వోటి రాసేస్తున్నాడుట' అని ఓ తాజావార్త వందించాడు మాధవ్!

'అమ్మ బాబోయ్! ధారావాహిక నవలే! ఒరేయ్! తెరవెనకాల వీడికి ఎవరో ఉన్నార్రా, ఎవరో గురువుని పట్టాడు వీడు లేకపోతే వీడి కీ తెలివి ఎక్కణ్ణుంచి వచ్చిందంటావ్?' అని మాట్లాడుతున్నవాణ్ణి, ఎదురుగా చూస్తూ— 'ఆఁ'! అని అలాగే నిశ్చేష్టుడై ఉండిపోయాడు శేఖరం తక్కిన ఇద్దరూ కూడా శేఖరం చూస్తున్నవేపుగా చూస్తూ— 'ఆఁ!' అన్నారు సంయుక్తంగా ఆశ్చర్యంతో!

ముంజేతులు కనిపించీకనిపించకుండా ఉన్న ఇద్దరు లాల్చీ వేసుకొని, కట్టుకొన్న పంచ అంచులు నేలపై జీరాడుతున్నదికూడ గమనించకుండా, పల్లటి

37వ పేజీ చూడండి





## అన్నీ కానిమాటలే:

1 ఈ రోజుల్లో కారంకాని కారం కలవాడే గొప్పవాడు అది—ఏ కారం?

2 ఈరోజుల్లో ఆడపిల్లల తండ్రులు మాత గాని, మాతలకై చాలా అగచాట్లు పడుతున్నారు ఏ మాతలు?

3 కోమట్లూ, బ్రాహ్మలూ కూడా కోడికాని కోడిని మక్కువగా ఆరగిస్తారు ఏ కోడి?

4 ఏ భవన నిర్మాణంలోనైనా స్త్రీ గాని, స్త్రీది ముఖ్యపాత్ర ఏ స్త్రీ?

5 వేపాకుకాని వేపాకును 'చారు'లో వేస్తే రుచి కల్గుతుంది ఏ వేపాకు?

6 జంగంకాని జంగం అంటే ఎంతటివారికైనా హడలే ఏ జంగం?

7 కారుకాని కారుకి మరో కారుకాని కారు అంటే బలే హుషారు మొదటి కారేది? 2 వ కారేది?

8 మాటకాని మాట మిళితంగా ఏ కూర వండినా రుచిస్తుంది అది—ఏ మాట?

9 పెళ్ళికూతుళ్లకు శోభ నిచ్చేది రాణికాని రాణి—ఏ రాణీ?

10 రాయికాని రాయివల్ల ఎన్నో కొంపలు కూలుస్తున్నాయంటే ఆశ్చర్యమేమీకాదు ఏ రాయి?

11 చోరీకాని చోరీ అంటే అందరికీ ఇష్టమే ఏ చోరి?

12 కొందరు వలకాని వలలో పడ్డారంటేచాలు—తిండి ధ్యాసైనా ఉండదు ఏ వల?

13 పండుగ రోజుల్లో ఇంటికి శోభనిచ్చేది రణము కాని రణము ఏ రణము?

14 కరణముగాని కరణము—అంటే కొందరు విద్యార్థులకు బలే హడలు ఏ కరణము?

15 కాకికాని కాకి జీవితం కడు దుర్భరమంటారు నిజమేనేమో ఏ కాకి?

16 గ్రామంకాని గ్రామమంటే అందరికీ భయమే అది—ఏ గ్రామం?

17 శివభక్తుల గృహాల్లో పండుకాని పండు తప్పకుండా ఉంటుంది ఏ పండు?

18 స్టేజికాని స్టేజి తగు విధంగా లేనిది ఏ ఉత్తరమైనా అంగుళం కూడా పొగదు అది— ఏ స్టేజి?

19 టీ కాని టీ వలన పిల్లలు బాగుపడతారు ఏ టీ?

20 బస్‌కాని బస్ లేకుంటే ఇక స్కూలే లేదనవచ్చు ఏ బస్?

21 వనంకాని వనంలో కష్టసుఖాలు సహజమే ఏ వనం?

22 మా స్నేహితుల్లో అందరికన్నా గొప్పవాడో ఖరంకాని ఖరం ఏ ఖరం?

23 కొందరికి ఏ విషయంలోనైనా హాలంకాని హాలం పుట్టుకొస్తుంది ఏ హాలం?

24 కాంతంకాని కాంతం అంటే కొందరికి గిట్టదు ఏ కాంతం?

25 పైవాని జవాబులు మీకు తెలీకపోతే కాయకాని కాయలు మీ పెద్దలతో తిని, ఆలోచించండి—జవాబులు దొర్కుతాయి కాని మీరు తినే కాయ ఏది?

ఎస్ నారాయణ, పి. సుదర్శన్,
(హైదరాబాద్)

* * *




అమ్మ: పాపా ఏమిటే ఈ గౌను యిలా చింపుకున్నావ్

పాప: మరే! నా బొమ్మకి గౌను కుట్టుకున్నానే

విద్యారాణి (బెజవాడ)

* * *

జవాబు:

1 అధికారం 2 జామాతలు 3 టక్కోడి, 4. మేస్త్రీ 5 కరివేపాకు 6 భుజంగం. 7 మొదటి కారు, కుర్రకారు, రెండవకారు షికారు 8 టమాట 9. పారాణి 10 పారాయి 11 కచోరి. 12 నవల 13 తోరణం 14 వ్యాకరణం 15 ఏకాకి 16 సంగ్రామం 17 విభూతిపండు 18 పోస్టేజి 19 పోటీ. 20 సిలబస్ 21 జీవనం 22 శిఖరం 23 కుతూహలం 24 ఏకాంతం 25 లెంపకాయ

# మనమూ – మనదేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## జఠరాశయ వ్రణములు:

గత వ్యాసములలో, జఠరాశయంలో ఏర్పడే ఇన్ఫ్లమేషనులకు సంబంధించిన వ్యాధులను గురించి చర్చించాను వ్యాసావళి ప్రారంభించినప్పుడే వ్యాధులకు (1) అపాయము (Trauma), (2) ఇన్ఫ్లమేషను (Inflamation), శైథిల్యము (3) (Degeneration), (4) నూతన వృద్ధి (Neoplasm) అని నాలుగు కారణములు ఉంటవనీ, ఏ వ్యాధి అయినా ఈ నాలుగు శాఖలకు చెందినదై ఉంటుందనీ వివరించాను

శరీరాంతర్భాగములను క్రమ్ముకుండే పొరలలో గానీ, శరీరమును క్రమ్మివుండే చర్మములోగానీ, అంత రాయం ఏర్పడినప్పుడు లోపలి ధాతువులు బయట బడతవి ఆ స్థితిని "వ్రణము" అంటారు ఆంగ్ల వైద్య పరిభాషలో "అల్సరు" లంటారు వ్రణము యొక్క వైశాల్యము, ఆకారము, లోతు, స్వభావము వివిధ పరిస్థితులలో వివిధములుగా ఉండవచ్చును అల్సరు ధాతువుల శైథిల్యంవల్ల ఏర్పడే రోగస్థితి కాని అల్సరు ఏర్పడ్డప్పుడు దాని అంచులలో ఇన్ఫ్లమేషను కూడా ఏర్పడి ఉండవచ్చును ఇప్పుడు జఠరాశయంలో ఏర్పడే వ్రణములను గురించి వివరిస్తాను

అల్సరు చాల కొద్ది కాలంలో ఏర్పడవచ్చును లేక కాలక్రమాన ఏర్పడవచ్చును అందువల్ల జఠరాశయంలో ఏర్పడే అల్సర్లకు కూడా తీవ్ర దశ (Acute Stage), దీర్ఘదశ అని రెండు దశలు ఉంటవి

ఏ కారణాలచేత తీవ్రమయిన గేస్ట్రైటిస్ ఏర్పడుతుందో, ఆ కారణములచేతనే తీవ్రమైన అల్సర్లు కూడా ఏర్పడవచ్చును జఠరాశయపు మ్యూకస్ పొరను విషపదార్థములు నశింపజేయగా ఈ అల్సర్లు ఏర్పడుతవి ఆ అల్సర్లు లోతైనప్పుడు రక్తనాళములను కూడా ఆనవేయవచ్చును అప్పుడు రక్తవాంతి ఏర్పడుతుంది తీవ్రస్థితిలో జఠరాశయ వ్రణములవల్ల ఏర్పడే లక్షణములు, అది ఏర్పడిన జఠరాశయ భాగముమీద ఆధారపడి ఉంటవి వాటిని అర్థం చేసుకోవాలంటే, మళ్లీ జఠరాశయం నిర్మితిని గురించి వ్రాసిన వ్యాస భాగములను జ్ఞాపకం ఉంచుకోవాలి ఇంచుమించుగా గేస్ట్రైటిస్ తీవ్ర దశలో ఉండే లక్షణములన్నీ తీవ్ర వ్రణముల వల్ల కూడా ఏర్పడవచ్చును అందులో రక్తవాంతి చాలా ముఖ్యమైనది, ప్రమాదకరమైనది కాఫీ డికాషను రంగు గల పదార్థము వాంతి కాగానే ఎంత శీఘ్రంగా వైద్య సహాయం పొందగలిగితే అంత మంచిది ఎర్రని రక్తము వాంతి అయినా అంతే

సాధారణంగా తీవ్రస్థితిలో ఉన్న వ్రణములు త్వరగా ఏ చికిత్స లేకుండానే మానిపోతవి అప్పుడప్పుడు దీర్ఘస్థితిని చెందవచ్చును కూడా తీవ్ర స్థితిలో ఏర్పడే అల్సర్ల రోగ స్వభావము ఇన్ఫ్లమేషనుకు సన్నిహితమై ఉంటుంది కాని దీర్ఘ స్థితిలో కనుపించే అల్సర్లు క్రమంగా కొంత కాలంలో పరిణమించిన వ్రణములు అవి, కొన్ని కారణములవల్ల, ధాతువుల నిర్మితీ విధానం మారిపోయి శైథిల్యము పొంది ఏర్పడేవి ఒకమారు ఇవి ఏర్పడిన తరువాత ఏ చికిత్స లేకుండా వాటి అంతట అవే మానిపోవడం సాధారణంగా జరగదు అయితే ఈ విషయంలో 'చికిత్స' అంటే కేవలం ఔషధ సేవ మాత్రమే కాదు భోజనాదులలో మార్పు, అభ్యాసములలో మార్పు, మనశ్శాంతి వీటి నివారణకు చాలా అవసరములు అంటే వీటి నివారణలో వైద్యుడికంటె రోగి ఎక్కువగా కృషి చేయవలసి ఉంటుందన్నమాట

జఠరాశయంలో దీర్ఘ వ్రణములు ఏర్పడడానికి నిశ్చితములయిన కారణములు ఇంక నిరూపించబడలేదు కాని కొన్ని ఇతర రోగ స్థితులకూ దీనికీ కొంత సంబంధం ఉన్నదని భావించడానికి అవకాశం ఉన్నది

పయోరియా, టాన్సిలైటిస్ వంటి క్రిమి దోషములు నోటిలో ఏర్పడినప్పుడు కొన్ని విష పదార్థములు, ఆహారంతోనో, ఉమ్మితోనో జఠరాశయంలోకి పోవచ్చును సాధారణంగా వీటిని జఠరాశయంలో ఉండే హైడ్రోక్లోరిక్ ఏసిడ్ నాశనం చేస్తుంది అలా చేయలేనప్పుడు తీవ్రదశలో అల్సరు ఏర్పడి, పుండును మాన్పే శక్తి దేహంలో తగ్గి ఉన్నప్పుడు, దీర్ఘ వ్రణములుగా పరిణమించవచ్చును అందుచేత వాక్సంబంధమైన క్రిమి రోగములను (Oral Sepsis) వెంటనే నివారించుకోడం అత్యవసరం

ఒకొక్కప్పుడు జఠరాశయపు మ్యూకస్ పొరలో ఉండే రక్తనాళములలో రక్తం గడ్డకట్టినప్పుడు పరిసర ప్రదేశములు రక్తస్రావములేక నశించి అక్కడ అల్సరు ఏర్పడవచ్చును ఆవిధంగా ఏర్పడిన వ్రణం, జఠరాశయపు తరంగచలనంవల్ల అక్కడ ఉండే ద్రావక ప్రభావంవల్లా, పెద్దదై దీర్ఘస్థితిని అందుకోవచ్చును వృద్ధులయిన వారిలో రక్తనాళములు పెళుసెక్కి పోవచ్చును ఈ స్థితిని ఆర్టీరియో స్లిరోసిస్ (Arterio Sclerosis) అంటారు రక్తనాళముల లోపలి భాగమును మ్యూకస్ పొర వంటి మృదువైన పొర కప్పి ఉంటుంది ఇది పెళుసై దీని క్రింద నూతన ధాతువృద్ధి ఏర్పడినప్పుడు రక్తగతికి ఆటంకం ఏర్పడి రక్తం గడ్డ కట్టవచ్చును ఈ పరిస్థితే హృదయానికి సంబంధించిన ఆర్టరీలలో ఏర్పడ్డప్పుడు హృదయంలో శూల, మరణము సంభవిస్తవి సిండురోగులలో హృద్రోగంలో జఠరాశయ ధాతువుల శక్తి నశించి వ్రణము ఏర్పడే అవకాశం అధికమవుతుంది

శరీరంలో ఎక్కడ క్రిమిదోషం ఏర్పడినా ఆ క్రిమి జనితములయిన విషములు రక్తంద్వారా జఠరాశయం మ్యూకస్ పొరకు చేరి, అక్కడ అల్సరును ఏర్పరచవచ్చును అసలు జఠరాశయంలోనే ఇన్ఫ్లమేషను కలిగించే క్రిమి విశేషము ఉన్నదనీ అది ఇంకా ఇదమిత్థమని నిర్ణయించబడలేదని కొందరు వైద్యవేత్తల సందేహము

శరీరానికి యిమడని ఆహారపదార్థములూ, తేలికగా జీర్ణంకాని పదార్థములూ, కొవ్వు పదార్థములూ ఈ జాతికి చెందినవి బహుకాలం తీసుకున్నప్పుడు, జఠరాశయం మ్యూకస్ పొరలో గ్రంధులు నశించి ద్రావకం తగ్గిపోవచ్చును ఆ స్థితిలో పసరూ, పేంక్రియాస్ రసమూ పైలోరస్ ద్వారా జఠరాశయంలో ప్రవేశించి అక్కడ వ్రణమును ఏర్పరచవచ్చును కాని ఇవన్నీ అనుమానములే కాని, నిశ్చయమయిన కారణములు కావు

ఆధునిక కాలంలో ఉధృతమై జరిగే సంఘర్షణ, పోటీ, అశాంతి, అపజయము, ఇవి కలిగించే మనోవ్యధలు జఠరాశయంలో, డుయోడినంలో (చిన్న ప్రేగులో మొదటి భాగము) వ్రణములు ఏర్పడడానికి చాలా ముఖ్యమయిన కారణమని చాలా మంది విశ్వాసం ఆ అభిప్రాయం చాలా పురాతనమయినది కూడా ప్లేటార్కు అనే మేధావి, "వ్యాయస్థానంలో తనలో అడ్డుకున్న మనస్సు తన వ్యాధికి కారణమైనదని శరీరం అభియోగం తెస్తే ఈ మనస్సనే కౌలుదారు, భూమందును రోగగ్రస్తం చేసినమాట నిజ"మని ఆ న్యాయస్థానం నిర్ణయిస్తుం దన్నాడు జీర్ణకోశ వ్యధులమీద, మనఃస్థితికి ఉన్న ప్రభావం అతి ముఖ్యమైనది ఆ విషయాన్ని వైద్య శాస్త్రజ్ఞులు కొంతకాలంగా మరచిపోయినారు కాని ఈమధ్యనే మళ్లీ జీర్ణకోశ వ్యాధులకు, మానసిక పరిస్థితులకు ఉన్న సంబందాన్ని పరిశోధనలవల్ల నిర్ణయించడం జరుగుతున్నది మానసిక వ్యధలవల్ల డుయోడినంలో అల్సరు ఏర్పడవచ్చునన్న విషయం చాలామంది విశ్వసిస్తున్నారు కూడా ఎక్కడో శిరస్సులో ఉన్న మెదడుకూ, ఉదరంలో ఉన్న జఠరాశయానికీ ఏమిటి సంబంధము? అసలు మనస్సు అనేది శరీరంలో ఎక్కడ ఉన్నది? ఈ ప్రశ్నలకు వైజ్ఞానికమయిన సమాధానం లేదు. కాని యోగశాస్త్రంలో నాభికిపైన, ప్రక్కటెముకలకు క్రింద ఉన్న ప్రదేశము మానసిక

—41వ పేజీ చూడండి




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**14-12-1962 శుక్రవారము మొదలు**
**20-12-1962 గురువారము వరకు**

## మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా )

కోర్టు కచేరీలలో సులభంగా పనులు జరిగే సమయం వృత్తి, ఉద్యోగాలలో మనస్సుకు స్వస్థత లభిస్తుంది సాధారణంగా సాధ్యం కాని పని అంటూ ఉండదు మిమ్ములను ఎవరు ఎన్ని విధాల కదిలించటానికి చూచినా నిగ్రహంతో జాగ్రత్తపడగలుగుతారు ముందు జరుగబోయే పనుల నిమిత్తం ఇతరుల చేతికి డబ్బు ఈయవలసి రావచ్చు అయితే ముందు జాగ్రత్త అవసరం కష్టవార్తలు వింటారు అధికారులు ఈ సమయంలో ఉపకారం చేస్తారు ముఖ్యంగా ఆరోగ్య విషయంలో జాగ్రత్తపడుతూ మీ కార్యక్రమాలను సాగించుకొనవలసివస్తుంది మీ విద్య, శక్తి చక్కగా ఉపయోగపడతగిన అవకాశాలు లభిస్తవి ముందు ఫలితం ఎదురు చూడకుండా, ఉదారంగా ప్రవర్తించవలసిన అవసరం కలుగుతుంది.

*  *  *

## వృషభం:

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఇతరుల ప్రసంగాలను వినీ విననట్లు పోవలసి ఉంటుంది విలువగల వస్తువులపైన గాని, స్థిరాస్తులు మొదలయిన వానిమీద గాని తొందరపడి డబ్బు పెట్టవద్దు. స్నేహితులే మిమ్ములను కలహాలకు దించటానికి చూస్తారు దైవానుగ్రహంవల్ల అన్నిటినీ తొలగించుకొంటూ మీ పేరు ప్రతిష్ఠలను నిలబెట్టుకుంటారు వ్యాపార వ్యవహార రంగాలలో ఇతరుల అసూయవల్ల చిన్న చిన్న ప్రతిబంధకాలు ఏర్పడి వాటంతట అవి తొలగిపోతవి గోరంత విషయాన్ని కొండంతగా మాట్లాడే వారుంటారు. ఉద్రేకాన్ని తగ్గించుకొనండి అవయవముల సంధుల యందు, శిరోభాగములయందు బాధ కలిగే సూచనలున్నవి. కుటుంబ విషయాలలో ఏదో ఒక కొరత కనిపిస్తూ ఉంటుంది

**గ్రహస్థితి**

కర్కాటకంలో రాహువు, సింహంలో అంగారకుడు, తులలో శుక్రుడు, వృశ్చిక ధనుస్సులలో సూర్యుడు, ధనస్సులో బుధుడు, మకరంలో శని, కేతువులు, కుంభంలో గురువు, కటక, సింహ, కన్యలలో చంద్రుడు

*  *  *

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా )

సందేహాలు వదలి కార్యనిర్ణయం చేసుకొంటూ ముందుకు వెళ్లటం అవసరం. ధనలాభం బాగుంటుంది గత కాలానికి సంబంధించిన ఆలోచనలతోను, ప్రసంగాలతోను ప్రస్తుతం జరిగే కార్యక్రమాలు ఆలస్యం కాకుండా చూచుకొనండి అనేక సందర్భాలలో క్రొత్తవారితో పరిచయం లభిస్తుంది సంచారంతో కూడిన పనులు ఎక్కువ. మీ యుక్తివల్ల కార్యభారం క్రమంగా తగ్గించుకొనగలరు కుటుంబంలోనివారితో స్పర్థలు వచ్చేటట్లు తోచినా, ప్రస్తుతం అటువంటివి ఏమీ ఉండవు. బాహ్య విషయాలలో పేరు ప్రతిష్ఠలు లభిస్తవి ధర్మకార్యముల నిమిత్తం మీ శక్తిని మించి ఖర్చు చేయవలసివస్తుంది. బంధువులవద్ద నుంచి సంతోష వార్తలు తెలుస్తవి వారం రెండవ భాగంలో ఇతరులవద్దనుండి రావలసిన ధనం వస్తుంది.

*  *  *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష )

ఓర్పుతో మీ అదృష్టాన్ని అందుకో గలుగుతారు దైవికంగా వచ్చే మార్పులు క్రమంగా ముందు ముందు బాగా అనుకూలిస్తవి సంఘంలో గౌరవ పదవులను నిర్వహించవలసివస్తుంది. వృత్తి, ఉద్యోగాలలో ఇతరుల సలహాలను అనుసరించటంలో దూరదృష్టి అవసరం తొందరపడి విలువగల వస్తువులమీద మీ ధనం వినియోగించవద్దు పిల్లల ఆరోగ్యం సరిగా ఉండకపోవచ్చు ప్రయాణాలు సకాలంలో సుఖంగా నెరవేరుతవి వ్యవహార చిక్కులనుంచి చాలా భాగం బయట పడగలుగుతారు మీ సొమ్ము తింటూ, మిమ్ములను హేళన చేసేవారుంటారు అధికారులవల్ల ఒక సమయంలో చిక్కు కనుపించినా, పర్యవసానంలో అనుకూలత కలుగుతుంది.

*  *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా )

మీ ఊహలు ఒక రూపానికి వచ్చే సమయం స్వల్ప శ్రమతో గొప్ప కార్యాలు కలసివస్తవి అయితే పనులలో హడావిడి, విశ్రాంతి లేకపోవటం అనేవి మాత్రం తప్పవు ఒకటి రెండు సందర్భాలలో

విరోధులతో పోటీ కనుపిస్తుంది ధైర్యంతో మీ పనులను జయప్రదంగా జరుపుకోగలుగుతారు మొత్తంమీద అనేక విషయాలలో ఉత్తమ సూచనలు కనుపిస్తవి శుభకార్యాలు అనుకూలిస్తవి ముందుగా ఇతరులకు వాగ్దానాలు ఈయటం, వ్యవహార రంగంలో హామీ ఉండటం మొదలయినవాటివల్ల కొంత శ్రమ కలిగే సమయం అధికారులతో మృదువుగా పనులు జరుపుకొనటానికి ప్రయత్నించండి విశేషంగా ధనంవచ్చి ఖర్చు కాగల సమయం

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

పెద్దమనుష్యుల సలహాలను త్రోసివేయలేకపోతారు అనుసరించతగిన అవకాశాలు వెంటనే కనుపించవు మీ మాట నేర్పువల్ల వ్యవహారాలను చక్కబరచుకొంటారు కుటుంబంలో శుభ, సంతోష కార్యాలు నెరవేరుతవి వృత్తి, వ్యాపారాలలో ఒకదాని కొకటి పొందికలేని పనులవల్ల శ్రమపడి చివరకు విజయం పొందగలుగుతారు మిమ్ములను గురించి తోటివారిలో రకరకాల భావాలు రేకత్తగల సమయం అయితే మీ హోదా తగ్గుతుందనే మాట ఉండదు మీ శ్రమ కలసివస్తుంది ఆదాయ వ్యయాల విషయంలో ముందు వెనుకలు ఆలోచించుకొంటూ కార్యక్రమాలు నిర్ణయించుకొనటం అవసరం చేయవలసిన పనులు అడుగడుగునా మరచిపోతూ ఉంటారు

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

గ్రహబలం బాగున్నది మీ ఆరోగ్యస్థితి ఇంతకు ముందుకన్నా మేలు అన్ని విధములయిన పనులు స్వయంగా నిర్వహించుకొంటారు లోగడ మీరు చేసిన కృషి ఫలించి, ఆదాయం సంతృప్తికరంగా అందుకోగల సమయం కుటుంబంలో సుఖము, సంతోషము లభిస్తవి వృత్తి, వ్యాపార రంగాలలో తటస్థపడేవారి మనస్తత్వాన్ని ముందుగా గ్రహించి జాగ్రత్తగా మసలుకోగలుగుతారు ఈ సమయంలో బంధువర్గంలోని మనుష్యులవల్ల మానసికంగా అశాంతి కలుగుతుంది సంఘంలో మంచి పేరు సంపాదిస్తారు లోగడ మీరు ఇతరులకు చేసిన సహాయం పాముకు పాలు పోసినట్లు తయారు కాగల అవకాశాలున్నవి జాగ్రత్తగా ఉండండి మీరు అనుసరించే పద్ధతులలోని సాధక బాధకాలను గ్రహించి నడచుకొంటారు

* * *

**వృశ్చికం:**

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

అధికారాన్ని చలాయించుకో గలుగుతారు కాని, మొత్తంమీద బహు జాగ్రత్తగా నడచుకొనవలసిన సమయం ఆదాయ సంబంధమైన ఆటంకాలు, ఆందోళన తొలగిపోతవి బంధువులవద్దనుంచి సంతోష వార్తలు తెలుస్తవి. ఇంతకుముందు ప్రయత్నించినా జరుగని శుభకార్య విషయంలో ఆశాజనకమైన వాతావరణం కనుపిస్తుంది ఉన్నత స్థితి యందున్నటువంటి పెద్ద మనుష్యులను కలుసుకొంటారు ఈ వారం శారీరకంగా, మానసికంగా కూడా ప్రశాంతంగా ఉంటుంది కలహ ప్రసంగాలలో గాని, వ్యవహార విషయాలలోగాని సమయానుకూలంగా జాగ్రత్త పడండి వ్యయప్రయాసలు పెరగకుండా చూచుకొనటం అవసరం

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

బాహ్య గౌరవ ఆడంబరాలతోపాటు మానసికంగా కూడా ప్రోత్సాహకరమైన సమయం తోటివారి లోపాలోపాలను సర్దుకుని కార్యరంగంలో వెలితి కనుపించకుండా చూచుకొనగలుగుతారు ఇతరులకు న్యాయము, క్షేమము కలుగతగిన సలహాలను ఈయగలుగుతారు ఆర్థికంగా కలుగుతున్న శ్రమ కొంతవరకు తగ్గుతుంది సాధారణంగా ఈ సమయంలో ఏ ఆలోచన చేసినా వెంటనే ఆచరణలో పెట్టగల అవకాశాలు లభిస్తవి ఇంతకుముందు జరుగుతున్న నిరుపయోగమైన ఖర్చులను తొలగించుకొనగలుగుతారు సమయంలో ధైర్యము, సాహసముచేసి మీ మాటను చెల్లించుకొనగలుగుతారు ప్రయాణాలు అనుకున్న ప్రకారం చేయలేకపోతారు

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఈ సమయంలో జరుగని పనులను గురించి ఆదుర్దా పడతారు కాని, జరిగిన వాటివల్ల కలిగిన ప్రయోజనం కూడా పెద్దగా కనుపించదు ఇతరుల నిమిత్తం శ్రమ అధికం ప్రయాణాలు, ధన విషయంలో అవసరము, వత్తిడి పెరుగుతవి వ్యవహార రంగంలో మీరు తటస్థ మార్గాన్ని అనుసరించవలసివస్తుంది మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది ఇతరుల చేతిలోని ధనంమీద ఆశ పెట్టుకుని కార్యం ప్రారంభించతగిన సమయం కాదు గాంభీర్యంతో మీ అంతస్తు నిలుపుకొనవలసిన సమయం వారం రెండవ భాగంలో పరిస్థితులు క్రమక్రమంగా మారగల అవకాశాలున్నవి వృత్తిలో ఫలితం లభించగలదు శుభవార్తలు వింటారు

* * *

**ఈ వారము ధరలు**

బంగారు ధరలో తేజీ రాగల లక్షణం చాల తక్కువ వారాంతంలో స్వల్పంగా తేజీవచ్చి తగ్గవచ్చు వెండి ధర గత వారం మాదిరిగా ఉంటుంది నూలు ధర తగ్గుతుంది ధాన్యం ధరలో నిలకడ తక్కువ వెంటవెంటనే హెచ్చు తగ్గులు రాగల అవకాశాలున్నవి వేరుశనగపప్పు ధర మందీలో నిలుస్తుంది నూవుల ధర నిలకడగా ఉంటుంది

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

గ్రహస్థితి అనుకూలంగా ఉన్నది అంతస్థుకు తగినట్లు కార్యక్రమాలను చక్కగా జరుపుకొనగలరు అన్ని విధాలా సమర్థులయినవారి అండ లభిస్తుంది ప్రస్తుతం కలిగే అనుభవంవల్ల ఏ సమయంలో ఎలా ప్రవర్తించవలసినదీ చక్కగా తెలుసుకొంటారు ఆదాయం బాగుంటుంది పదిమందిలో గౌరవము, పేరు ప్రసిద్ధులు లభిస్తవి అకస్మాత్తుగా కలిగే ప్రమాద సూచనమంచి దైవికంగా తప్పుకొనగలుగుతారు పిల్లల మూలంగా ఆనందదాయకమైన కాలం శారీరక, సుఖ సౌఖ్యాల నిమిత్తం ఖర్చులు అధికం ఒక సమయంలో ఇతరుల మాటను త్రోసిరాజని ఆత్మ గౌరవమును నిలబెట్టుకొనవలసివస్తుంది.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

పట్టుబట్టి కార్యం సాధించుకొనవలసి ఉంటుంది. బయటకు చెప్పుకోతగిన కారణాలు కనుపించవు కాని, మీ పనులు ముందుకు సాగకుండా చిన్న చిన్న ఆటంకాలు వస్తూ ఉంటవి వ్యయప్రయాసలు అధికం చివరకు ఫలితం బాగుంటుంది కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించిన ఆందోళన కలుగుతుంది. శుభకార్య ప్రయత్నాలు సుముఖంగా జరుగుతవి కోర్టు కచేరీలలో శ్రమపడి కార్యం సాధించుకొంటారు క్రొత్త వ్యాపారాలవంటివానిలో తాత్కాలికంగా ప్రోత్సాహం లోపిస్తుంది. ధన విషయంలో ఇతరులమీద ఆధారపడవలసిన సమయంకాదు శుభవార్తలు తెలుస్తవి ఇతరుల పనులయందు ఉత్సాహం చూపలేకపోతారు. 



## విధేయత

### (మొదటి బహుమతి)

అది నేను ఎర్ ఫోర్స్ స్కూల్ (బెంగుళూరు)లో ట్రెయినింగుపొందు తున్న రోజులు. దేశం నలుమూలల నుంచి చాలామంది అచ్చట చేరారు ట్రెయినింగు కొరకు. మా ఫ్లయిట్ లో 54 మంది ఉన్నారు. ఓరోజు ట్రాన్సుఫర్ అయి కొత్తగావచ్చిన మా ఫ్లయిట్ కమాండర్ మమ్మల్ని ఒకరి తరువాత ఒకర్ని మా పేరు, ఊరు మొ॥ అడిగి పరిచయం చేసుకుంటూ ఉన్నారు. ఇలా అచ్చట నున్న మా అందరి పరిచయం చేసుకున్నారు ఇంతలో ఒకతను బయటికి వెళ్ళిఉండి ఆలస్యం అయిందని ఉడుకుదుడుకులలో వచ్చి మాలో చేరాడు, కొన్ని కార్డులు, కవర్లతో. ఫ్లయిట్ కమాండర్ మామూలుగా అతని పేరు అడిగిన తరువాత "ఫ్రం విచ్ ప్లేస్ యు హ్యావ్ కం ఫ్రం?" (నీవు ఎక్కడినుంచి వచ్చావు) అని అడిగారు. వెంటనే అతడు 'సర్ ఐ కేం ఫ్రం పోస్టాఫీస్' అని జవాబిచ్చాడు నిస్సందేహంగా ఓసిపాయి పోజు పెట్టి. కమాండరుతో సహా మేమంతా గొల్లుమని నవ్వాం. కథ అర్థం కాక, అతను తెల్ల మొహం వేశాడు. తరువాత మా కమాండరు తెలిపారు: తను అతని నడిగింది ఏ ఊరునుంచి వచ్చాడని. అది విని అతనుకూడా నవ్వుకున్నాడు.

నిర్మల్ పీరాప్ (తాంబరం)

## 'సారీ!'

### (రెండవ బహుమతి)

మా అన్నయ్య పెండ్లిలో జరిగిన ఈ సంఘటన తల్చుకుని మా వదినెతో సహా మేం యిప్పటికీ నవ్వుకుంటూంటాము. మా అన్నయ్యలాగే అప్పటికి పెళ్లికూతురైన మా వదినె కూడా నవనాగరికంగా చాలా చదువుకున్నది. ఆమె జెడ బాగా పొట్టిగా ఉన్నందున సవరాలు పెట్టడం తప్పనిసరైంది. కాని అలవాటు లేకనో ఏమో పీటలమీద ఉన్నంతసేపూ

> స్థలాభావంచేత కొంతకాలం 'కథానికథ' శీర్షిక నిలిపివేయదలిచాము పాఠకులు సహకరించి తిరిగి మేము కోరే వరకూ తమ కథానికథలు పంపరని ఆశిస్తున్నాము.

ఆమె జెడ ముందుకు వేసుకోడం సవరం చూసుకోడం ఎవరేనా ఏమేనా అనుకుంటారేమోనని వెనక్కి వేసుకోడం చేస్తున్నది. 'తంతు' మంగళసూత్రధారణవరకూ వచ్చింది. పెండ్లికుమారుడు లేచాడు మంగళసూత్రం పట్టుకుని. పెళ్లికూతురు జెడ వెనక్కి వేసు (విసురు) కోడంలో ఫెడీమని పెళ్లికుమారునికి తగిలింది. అలవాటు కాబోలు ఆమె వెంటనే "సారీ!" అన్నది. క్షణంసేపు మా అన్నయ్య దిగ్భ్రింతుడైపోయాడు. ఆమె కూడా సిగ్గుతో సగమైపోయింది.

మునీలి నరేంద్ర (కాకినాడ)

## రేడియో దగా!

### (రెండవ బహుమతి)

ఒకనాటి రాత్రి నేను, మా చెల్లాయి, తమ్ముడు కలిసి రేడియో ప్రోగ్రాం వింటూ కూర్చున్నాము. అప్పుడు రేడియోనుండి రవీంద్రనాథ ఠాగూరు వ్రాసిన "పోస్టాఫీసు" తెలుగు నాటకం ప్రసారమవుతున్నది. మేమంతా నాటకం వినడంలో నిమగ్నుల మయ్యాము. నాటకం మధ్యలో నాటకంలో ఒక కుఱ్ఱవాడు గదిలో ఒంటరిగా కూర్చొని పోస్టు-జవాన్ని "ఏమోయ్ ఇలారా" అని పిల్చాడు. ఆ దారి వెంట పోతున్న బిచ్చగాడు యిది (రేడియో-పిలుపు) విని మా యింటి దగ్గర ఆగాడు. నాటకం పూర్తయిపోయింది. కాని బిచ్చగాడు మాత్రం మా యింటిముందు నించి కదలలేదు.

"ఇంకా భోజనాలు కాలేదు వెళ్ళిపొమ్మని" మేము అంటే, వాడు "ఏమోయి ఇలారా అని దారిన పోయే నన్ను పిలిచి, ఇంత సేపు నిలబెట్టించి ఏం లేదు పొమ్మంటారా" అని వాడు పెద్దగా అంటూ, తరువాత ఏమేమో గొణుక్కుంటూ (తిట్టుకొంటున్నాడేమో తెలియదు) వెళ్ళిపోయాడు. "ఏమోయ్ ఇలారా" అని రేడియోలో పోస్టు-జవాన్ని పిలిచిన పిలుపు ఫలితం ఇంతపని చేసిందని ఆశ్చర్యపోయి నవ్వుకున్నాము.

పాడిచేటి రామచంద్రాచార్యులు, (భద్రాచలం) ★



ఎక్కడా అకు అల్లాడ్డంలేదు అంతా స్తబ్దంగా ఉంది. టేబిల్‌మీద గడియారం, ఫేన్—రెండూ పోటీపడ్డట్టు చప్పుడుచేస్తూ తిరుగుతున్నాయి సాయంకాలం నాలుగ్గంటలు

"ఏమిటో, నే నింకాట్టే కాలం ఉంటానని పోవడు!" కాఫీతాగుతూ తాపీగా అని, రావుమొహం లోకి చూసింది రాజేశ్వరి

వెంకట్రావు కుర్చీలో వెనక్కి వాలి కిటికీ బయటికి రెప్పార్పకుండా చూశాడు ఆ కళ్ళలో భావమేమిటో రాజేశ్వరి కర్థంకాలేదు

"గుండెజబ్బున్నవాళ్ళ కెప్పుడు ముంచు కొస్తుందో చెప్పడంకష్టం నాకవలు మొదట్నుంచి అనుమానంగానే ఉంది నిన్న సర్జన్‌కూడ అదే మాటన్నాడు విశ్రాంతి తీసుకోమంటాడు—ఎక్కడుంది విశ్రాంతి! పని మానేసి యింటిదగ్గర కూర్చుంటే సరిపోతుందా! పిచ్చిగాకపోతే! ." తలొంచుకునే మధ్యమధ్య ఆగుతూ చెప్పుకుపోయింది రాజేశ్వరి

కాసేపెవరూ మాట్లాడలేదు

"ఇలా మీతో యేదో వెర్రిగా మాట్లాడు తూనే జారిపోతే బాగుణ్ణు ఒక్కటే బాధ! ముప్పై యేళ్ళు నిండాయో లేదో, అప్పుడేమీకు మూడోపెళ్లి!" రాజేశ్వరి రావుకేసి నవ్వుతూ చూసింది ఆ కళ్ళలో ఏదో తడబాటు, బాధ, అసంతృప్తి నిండి అసహజంగా అదోలా కనబడ్డాయి

రావు తొందరగా కాఫీ త్రాగడంపూర్తి చేసికప్పుకింద ఉంచి, లేవాడు అతన్ని మళ్లా కూచోబెట్టాలన్న తాపత్రయంలో గట్టిగా నవ్వేసి అంది రాజేశ్వరి—

"ఇప్పట్నుంచి బెంగెట్టుకోక్కర్లేదులెండి, ఏమో, యిలాగే ఓ డెబ్బై యేళ్ళు లాగేస్తానేమో! ఈ జబ్బుతో ఎనభై, తొంభై యేళ్ళు బతికినవా ళ్లెంతమందిలేరు!"

రావు కూర్చోలేదు; కిటికీకేసి నడిచి నిలబడ్డాడు యింక మాటలు పొడిగించడం రాజేశ్వరికి చేత గాలేదు తడయిన కళ్ళతో దూరంగా యెక్కడో చూస్తూ కూర్చునిపోయింది

ఎంతసేపయిందో తెలియదు; బూట్ల చప్పుడువిని తుళ్లిపడ్డట్టు లేచి కళ్ళు తుడుచుకొంది

"ఇవాళో క అర్జంటు కేసుంది; రాత్రి నేవొచ్చే సరికెంతసేపవుతుందో! మీరు నాకోసం కనిపెట్టు కుండక తినేసి పడుకోండి"

రావు మెట్లు దిగి బయటికి వెళ్లిపోయాడు

వెంకట్రావు వెళ్లిపోయాక, రాజేశ్వరికి గట్టిగా ఏడవాలనిపించింది, ఒంటరిగా మనసులో బాధంతా కరిగిపోయేలా

రాజేశ్వరికి చిన్నప్పట్నుంచి తెలివైందనిపేరు స్కూల్లో చదివే రోజుల్లో నే ఆమెకి చాలా మంచి భవిష్యత్తు ఉందని మేష్టర్లు, ఊళ్లోవాళ్ళు చెప్పు కునేవారు స్కూల్లో, కాలేజీలో ఒక్కొక్క మెట్టే తప్పకుండా యెక్కవస్తున్నకొద్దీ, ఆమెలోనూ తల్లి దండ్రుల్లోనూ ఉత్సాహం, పట్టుదలా హెచ్చాయి డబ్బుకి వెనకాడక, కిట్టనివాళ్ల మాటలు లెక్క చెయ్యక, మిగతా విషయాలు వాయిదా వేసి, ఆమె చదవాలనుకొన్నంతకాలం చదివించారు అమ్మా, నాన్నా

ఉద్యోగంలో చేరాక, పనిలో చాలా నేర్పు చూపెట్టి మంచి పేరు సంపాదించుకొంది చాలా ఊళ్లనుంచి ఆమె వైద్యంకోసం వచ్చేవాళ్ళు ఈ పేరు, ప్రతి ష్టకి సాయం, తనే సర్వం అనుకొన్న అమ్మనీ, నాన్ననీ సుఖపెట్టడానికి కావల్సినంత డబ్బు చేతినిండా ఒకడి అడ్డుఆటంకం లేకుండా ఏది చెయ్యాల్నంటే అది చెయ్యడానికి యెంతో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం!

రాజేశ్వరికి కలలన్నీ పండినట్టుండేవి

ఒక రోజు;

హాస్పిటల్నుంచి అప్పుడే వచ్చి, పేపరు తిరగేస్తోంది. తండ్రి కింద తోటలో నౌకరుచేత మొక్కలన్నిం టికీ దగ్గరుండి నీళ్లుపోయిస్తున్నాడు తల్లి వంట పనుల్లో లోపలెక్కడో ఉంది.

ఇంటిముందు కారాగింది రావు దిగి లోపలికి వచ్చారు.

"మిమ్మల్ని శ్రమపెట్టడం యిబ్బంది పెట్టడం నాకు బాధగా వుంది కాని తప్పనిసరి ఒకసారి మా యింటికొచ్చి చూడాలి మీరు నా మిసెస్"

రాజేశ్వరి స్టెత్, కేస్ పట్టుకొని బయల్దే రింది కొందర్ని చూస్తే విసుక్కుంటూ ప్రశ్న లడిగి ఏదో చీటీ రాసి పంపించేయాలనిపిస్తుంది. కొందరి విషయంలో చేతైన సహాయం చెయ్యడమే పరమధర్మంలా అనిపిస్తుంది

ఆ రాత్రి యింటికి తిరిగొచ్చేసరికి తొమ్మిదిన్నర. రాజేశ్వరికంతకుముందెన్నడూ లేని తృప్తి ఆనందం కలిగాయి ఎన్నో కేసులు చూసింది; నయం చేసింది, పేరు తెచ్చుకొంది. కాని, ఆ రాత్రి వసంత నిండుమనసు అపస్మారంనుంచి మళ్లీ స్పృహ గలిగినందుకు, త్వరలో నయం చెయ్యొచ్చనే ఆశ కుదర్చగలిగినందుకు, ఉన్నంత హాయిగా సంతోషంగా యెన్నడూ లేదు

అంత పెద్ద బంగళాలో రావు, వసంత—యిద్దరే ఉండేది ఒక ఆడమనిషి, వంటవాడు, నౌకరు తోడు. బయట పెద్ద పూలతోట ఇంట అన్నీ ఎక్కడి వక్కడ చాలా నేర్పుతో అందంగా అమర్చారు అంతా కళామయంగా ఉంది వాటన్నిటికన్నా ఆమె నెక్కు వగా కదిలించింది అతని ధోరణి

ఆ అదుర్దా, ఆందోళన—అదంతా యెందుకో! ఆమాత్రానికే అంత భయపడిపోయే సుకుమారుడు, యింకా పెద్దవాటికెలా తట్టుకుంటాడు! మిగతా అప్పుడు చూస్తే ఆ మొగంలో యెంత గాంభీర్యం! అంతా పైమెరుగే నన్నమాట! నిద్రపోతూ నవ్వుకొంది రాజేశ్వరి

రోజూ అక్కడికి వెళ్తూనే ఉంది— నెలరోజులపాటు

ఆ నెలరోజులూ జీవితంలో యెన్నటికీ మరిచి పోలేదు మొదట్లో కేవలం విధి, కర్తవ్యమనుకున్నా నెమ్మదిగా ఆమెలో ఎన్నో రకాల ఆలోచనలు ఊపిరి సలపనిచ్చేవిగాదు ఆమెకెంతో అవసరమయింది, ఇంతకాలం ఆమె కందకుండా తొలగిపోయింది ఏదో ఆమె కళ్ళముందు స్పష్టంగా ఎవరో చూపాలని చూపినట్టయింది

వసంతకోసం రావు యెంతో డబ్బు, సుఖం ఖర్చు

# వెలగని దీపాలు

పెట్టాడు తను చెప్తే చాలు ఖరీదెంతయినా, ఎంత దూరాన్నుంచి తేవాల్సివచ్చినా ఏ మందైనా తెచ్చాడు రాత్రి, పగలు, నిద్ర, విరామంలేకుండా ఆమె దగ్గరే కూర్చుని యెంత నరకం అనుభవించాడో! ఆ ఓర్పు, సహనం తను స్వయంగా చూసి ఉండకపోతే నమ్మగలిగేదికాదు ఆమె మాటెలా ఉన్నా ముందర ఆయన మంచమెక్కుతాడనిపించింది

ఎన్నో గంటల నిద్రలాంటి మగతలోంచి, ఏవో కొద్ది నిముషాలు మేలుకొనేది వసంత కళ్లు తెరవగానే అతనివంక చూసి, అంటిపెట్టుకున్నంత దగ్గర గాజరిగి తృప్తిగా కళ్లుమూసేది నీళ్లుచిమ్మే ఆ కళ్లలో కృతజ్ఞత, అభిమానం, ఆనందంలాంటి వి మాటల్లో యివ్వడని భావాలు కనబడేవి

రాజేశ్వరి కదొక అద్భుతమైన అనుభవం

ఇంత కాలం సరిగా తెలిసీతెలియని, పట్టించుకోని లోపమొకటి మరీ కొట్టొచ్చినట్టు కనిపించి, బ్రతుకుని రోజురోజుకీ నరకం చేస్తున్నట్టయ్యేది ఒంటరిగా ఉన్న సమయాలన్నిట్లో అదే ఆలోచన తిండి, బట్ట, సుఖం, స్వేచ్ఛ, వీటన్నిటికన్నా ఉన్నతమైందేదో ఉంది అది తనకి లేదు

పొద్దున్నే లేవడం, ఏవో మామూలు పనులు ఆస్పత్రి రోగులు, రోగాలు, భోజనం కాసేపు కునుకు మళ్లీ ఆస్పత్రి సాయంకాలం పేపరు చదవటం అమ్మా, నాన్నతో ఏవో కబుర్లు, మళ్లీ భోజనం, నిద్ర

ఇంతే ప్రతిరోజూ గడియారం ముల్లులాగే రోజులూ నిర్విరామంగా, ఏ వెలుగూ, కాంతీ లేకుండా గడిచిపోతూంటే రాజేశ్వరి, జీవితంలో ఘోరంగా పొరబడ్డాననుకొంది

వసంతకి, మధ్యలో ఓ వారంరోజులు తగ్గినట్టే తగ్గి, యింక పథ్యం యివ్వచ్చునుకునేసరికి మళ్లీ తిరగబెట్టింది ఇంకా తర్వాత రోజులు గడిచిన కొద్దీ రోగం తను చెప్పినట్టు నడుచుకోవడం మానేసింది

చివరికి, మామూలుకన్నా యెక్కువ శ్రద్ధ చూపించినా, యెంతో శ్రమపడ్డా, ఆమె చేజారిపోయింది. నెలపైగా పోరాటానికి, అలసటికి ముగింపు అలా జరిగినందుకు యెంతో బాధపడింది రాజేశ్వరి

వసంత పోయాక రెణ్ణెల్లదాకా అతన్ని చూడ్డం పడలేదు ఒకరోజు హాస్పిటలుకి ఫోనొచ్చింది. అయ్యగారికి జ్వరంగా ఉందని, నాలుగురోజుల్నుంచి లేవడంలేదని వంటవాడు చెప్పాడు

ఆమె వెళ్లేసరికి రావుకి నూటమూడుపైగా జ్వరం. పక్కమీద కళ్లుమూసుకుని పడుకొన్నాడు. ఏదో మందుఇచ్చి వచ్చింది అతని మాటల్లో, కదలికల్లో తొంగి తొంగిచూసే విచారపునీడలు తొలగదీయాలని ఏవో కబుర్లు చెప్పాలని చూసేది రాజేశ్వరి—అక్కడికి వెళ్లాల్సొచ్చిన నాలుగైదు రోజుల్లోనూ, యింక బ్రతుకెందుకన్నట్టు కనబడే రావుని చూస్తే గుండె తరుక్కుపోయేది అవతలి మంచంమీద దుప్పటిమడతలు కూడా నలగకుండా పక్క యింకా అలాగే ఉంది—వసంత యింట్లోనే ఉన్నట్టు, మళ్లా వచ్చి పడుకుంటుందన్నట్టు. అంతటి అభిమానం,

అనురాగం తల్చుకున్నప్పుడల్లా ఏదో చెప్పలేని బాధ మనసుకి రాపిడిపెట్టేది

ఈ రోజు, కాలంలో యింత దూరం ప్రయాణించాక, ఆనాటి పరిస్థితులకి, ఆలోచనలకి దూరంగా నిలబడి చూస్తే, రాజేశ్వరి మనసులో రకరకాల భావాలు కలగాపులగం అయిపోయి కొన్ని తననే నిందిస్తున్నట్టుంటుంది.

వసంతని చూసి తను అసూయపడిందా! రావుకి లేనిది చాలాతక్కువ అతనికి చదువు, ఆస్తితోపాటు హృదయముంది అతన్ని తనవాణ్ణిచేసుకున్న వసంతని చూసి తనలో రేగిన భావాన్ని అసూయ అని పిల్వచ్చేమో!

కాని !

ఉప్పెనలా ముంచుకొస్తున్న దుఃఖాన్ని తట్టుకోలేక తలని తలగడలో యిరికించింది రాజేశ్వరి

రావుకి వయసయ్యాక మళ్లీ నాలుగైదు నెలలు అతన్నసలు చూడలేదు ఒకరోజు శంకరయ్య వచ్చి నాన్నతో ఏవో ముచ్చటలు చెప్పాడు ఊళ్లో పెళ్లికాని అమ్మాయిలకి, అబ్బాయిలకి పెళ్లిళ్లు చేయించడమే శంకరం వృత్తి నాన్న నెమ్మదిగా మొదలెట్టాడు యౌవనాలవేళ, పాతికేళ్లుకూడా దాటాక యింకా పెళ్లికాకుండా ఉండడం మంచిది గాదని, రావుకి రెండో పెళ్లైనా, ఇంకా ముప్ఫైకూడా రాలేదని — రాజేశ్వరి ఒప్పుకోదని ఆయన కనుమానం అందుకని కొంచెం చుట్టిచుట్టి చెప్పుకొచ్చాడు

అంత ఉపోద్ఘాతం అవసరంలేదు తన మాటేలా ఉన్నా, అసలు అతను ఒప్పుకుంటాడని అనుకోలేదు అమాటే చెప్పింది కాని శంకరయ్య యెలాగో సాధించాడు

సరిగా ఆరునెల్లకి తిరుపతిలో పెళ్లిజరిగింది

ఆ తర్వాత మూడునెల్లు సెలవుపెట్టి యిద్దరూ దేశంలో చూడాల్సిన చోట్లన్నీ తిరిగొచ్చారు

తిరిగొచ్చాక చుట్టూ లోకమంతా పచ్చగా వెలిగిపోతున్నట్టనిపించింది కొంతకాలం కాని నెమ్మదిగా రంగులు మార్చడం మొదల్పెట్టింది రాజేశ్వరి నల్లగా, వికృతంగా, అసహ్యంగా యెన్నో కంతలు— తనవిచూసి వికటంగా నవ్వుతూ, వెక్కిరిస్తూ

బ్రతుకు ఆనందమయమైందనీ, జీవితంలో యింక కోరిక ల్లేవనీ, గర్వపడేసమయంలో, యెవరో కల్పి దూశారు నలుగురినోటా తలో మాటా ప్రచారమయింది హాస్పిటల్లో ఆమె అడుగుపెట్టగానే గుసగుసలు, యీసడింపులు చటుక్కున ఆగిపోయేవి రోడ్డుమీద నడుస్తుంటే హేళనలు, పరిహాసాలు, అపనిందలు! ఎవరిమీదో వంకబెట్టి మాటలు విసరడం! స్నేహితులు, బంధువులు, అంతా మొగంమీద ఒకమాట, చాటున మరొకటి! ప్రపంచంలో కుళ్లునీ, మురికినీ అంతా పోగుచేసి తనమీదికి రాళ్లలా విసురుతున్నట్టుంటుంది యింతకన్నా నరకం వేరే ఉండదేమో!

ఊళ్లో వాళ్లేమనుకొన్నా లెక్కచేయకపోను! కొద్దిరోజులుగా రావు ప్రవర్తనలో మార్పు, అతని మౌనం, నిర్లిప్తత చూస్తే, తన నక్షత్రాలు నిజంగానే గతులు తప్పినట్టనిపిస్తుంది తనే పాపంచేసింది!

రాజేశ్వరి ఒకనాదిరిగా దిగ్భ్రమతో అలా నిశ్చబ్దంగా పడుకొని ఆలోచించింది.

నలుగురూ అనుకునేట్టే రావుకూడా అనుకుంటున్నాడా? అతనిధోరణి కదే అర్థమేమో! కాని ఏమిటి బుజువు? అలా కాకపోతే తనెంత చనువుగా ఉన్నా, అతనలా దూరమవడానికి కారణం?

నిజానికి తను మామూలుగా చనువుగా ఉండగలుగుతోందో! నలుగురూ చాటే కథల్ని విని తనకి తానే మోసంచేసుకుని దూరమవుతోందేమో! చూస్తూ చూస్తూ చేజేతులా బ్రతుకుని గంగపాలు చేసుకోడం యెలా! తనే పాపం చెయ్యలేదని, వసంత చావుకి కారణం తను కాదని, తనప్రవర్తనలో తనకి పూర్తి విశ్వాసమున్నప్పుడు, యేటేవో ఊహించుకొని, బాధతో, భయంతో క్రుంగిపోవడందేనికి!

అతన్నే అడుగుతుందా! ఏమని అడగడం? అతనందరిలాగా అంత నీచంగా ఆలోచించలేడు ఎవరివో మాటలువిని కొద్దిగా కలతబడ్డా, తనమనసు విప్పిమాటాడితే, తననింతకాలం కల్చేసిన సంకెళ్లని తెంచుకు చెప్పగలిగితే వింటాడు

కాని సాయంకాలం తనెంత ప్రయత్నించినా, అతను మాటాడనేలేదు ఎలా చెప్పడం?

ఎన్నో ప్రశ్నలు! తేల్చుకోలేని, తేలని ప్రశ్నలు తేలక కాల్చే ప్రశ్నలు!

* * *

రోడ్డుమీదపడ్డాక రావు కెటువెళ్లాలో తోచలేదు అలా యేదో ఆలోచిస్తూ నడిచిపోయాడు

కాళ్లు క్లబ్బులో కీడ్చాయి వరండాలో కుర్చీలో కూలబడి పేపరు తిరగేస్తున్నాడు లోపల్నుంచి గట్టిగా అరుపుల్లాగ మాటలు వినబడుతున్నాయి

"ఏడీ, మన రాజేశ్వర్రావు రాలేదేం?"

"ఏ విద్రమందో యిచ్చేసి బజ్జో పెట్టుంటుంది!"

అంతా గొల్లుమని నవ్వారు

వెంకట్రావు చికాగ్గాలేచి వచ్చేశాడు రోడ్డెక్కినప్పట్నుంచి ఎక్కడికెళ్ళినా అన్ని కళ్లూ తనవంకే వింతగా చూస్తున్నట్టుంటుంది, ప్రతీ గొంతూ తనవిషయమే మాట్లాడుతున్నట్టు, తనని చూడగానే మాట మార్చినట్టు అనిపిస్తుంది రోత!

పిచ్చిగా నడిచిపోయాడు రావు, చాలాదూరం, ఎరగని దారుల వెంబడి, యెక్కడో యెన్నడూ చూడని కొత్తచోటకి

ఊరు బయట ఇసక తిన్నలమధ్య యేటిపాయలు పల్చగా సన్నగా రక్తనాళాల్లా పారుతున్నాయి చుట్టూ అన్నీ పెద్దపెద్ద కొబ్బరిచెట్లు బెల్లు విరిచినతోట మట్టిబెడ్డలమధ్య చెట్టునానుకుని కూలబడ్డాడు రావు

కొన్ని నెలల్నుంచి రాజేశ్వరి అదోలా అయిపోయింది ఏ పనిలోనూ యిష్టమున్నట్టు కనబడదు, మాటలు మనసులోంచి వచ్చినట్టుండవు ఏదో ఆలోచిస్తుందెప్పుడూ ఏమిటో మాట్లాడుతుంది దానికేం అర్థముండదు ఈ మధ్య చావుగురించే అస్తమానం చెప్పుకొస్తుంది అదామెకి నిజంగా ఉన్న భయమా, లేకపోతే ఊరికే తనని మభ్యపెట్టడానికి వేసినయెత్తా? ఏదీ తేలదు

కాని నిజంగానే రాజేశ్వరి ఆరోగ్యం సరిగా ఉన్నట్టు కనబడదు చాలా చిక్కిపోయింది పనివాళ్లమీద ఉత్తినే విసుక్కోడం, చికాకు, కోపం హడా




# నోపిన్

కాల్ కెమికో వారి బాధా నివారిణి

కండరముల నొప్పి, సియాటికా, గుండె జబ్బులు నుండి సత్వర ఉపశమనము

# మార్గ్యూయెంటమ్




నీమ్ క్రీమ్

దురదలు, పొంటెమలు, పొక్కటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ వాటికి

కాల్ కెమికో వారి వస్తువులు—"మార్గో" సబ్బును తయారు చేయువారు.

CF-2T(-6)

దక్షిణ ఇండియా ఆఫీసు 5/149, బ్రాడ్వే, మద్రాసు—1

---

సౌందర్య సీమ అంచులకు తేలిపోతారు

## "'హేజలైన్' స్నో" వాడండి



ఈ తేలికైన జిడ్డు లేని స్నో మీ ముఖమును మృదువుగా మనోహరముగా మరియు అందముగా ఉండేలా ఉంచుతుంది "'హేజలైన్' స్నో" ముఖ వర్చస్సును పెంపొందించే వాటిలో ఎంతో సౌమ్యమైనది దానిని పౌడరును అద్దు కొనే ముందు రాసుకోండి లేక దానిని రాసుకొని అందముగా ఉండండి

"'హేజలైన్' స్నో" తరతరాలుగా సుందరాంగుల సౌందర్య సాధనం




బరోస్ వెల్‌కం ఉత్పత్తి



BWY-11-TEL

# వెలగని దీపాలు

విడిగా తిరిగితే, మాట్లాడితే ఆయాసం యివన్నీ ఆరోగ్యం బాగున్నవాళ్ల లక్షణాలు కావు పలుగురూ అనుకొనే మాటలు ఆమె వింధా ?

రాజేశ్వరి అంత నికృష్టమైన పనికి పాల్పడుతుందా ! డబ్బుకోసం తనకే అన్యాయంచేసి యెరగని ఓ నిండుజీవాన్ని, చావుబతుకులమధ్య నిస్సహాయంగా వేలాడుతున్న ఓ అమాయక ప్రాణాన్ని బలి పెడుతుందా !

ఏమో, ఎవర్నీ నమ్మడానికిలేదు !

ఆ అమాయకంగా చూసే కళ్లవెనక, దాపరికం లేకుండా గుండెవిప్పి చూపెట్టినట్టు పలికేమాటలు వెనక అంత పాపం గడ్డకట్టుకుండడం అసంభవం! ముష్టికొచ్చిన నిరుపేద కాలిమీదగాయానికి మందురాసి నయంచేసిన రాజేశ్వరి అంత దారుణం చేయలేదు !

కాని, యేమో ! స్వార్థం ఎంత పనైనా చేయిస్తుంది ఆమె నిజంగా ఆ పాపభారంతోనే అలా దిగ్గళ్లతుందేమో ! లేకపోతే, ఆరోగ్యంగా నిక్షేపంలా ఉన్నమనిషి రెండుమూడునెల్లనుంచి గుండెజబ్బుని అలా కృశించి పోతుందేం !

రావు పగిలిపోతున్న ముక్కల్ని దగ్గరసా లాగి పట్టుకుంటున్నట్టు తలని చేతులమధ్య యిరికించాడు

ఈ మధ్య రాజేశ్వరి తనకేసి సూటిగా చూడలేక పోతూంది తనతో మనసువిప్పి మాట్లాడలేక పోతూంది కారణం యిదేనేమో !

పోనీ తను ! తన పరిస్థితీ అంతే

రాజేశ్వరి కనబడినప్పుడు ఆమె నాదరంగా, ఆప్యాయంగా దగ్గరికి తీసుకోవాలనిపిస్తుంది కాని ఆమె కళ్లలోంచి వసంత అమాయకంగా చూస్తున్నట్టు, ఆమె మాటల్లో వసంతే తియ్యగా, జాలిగా పలకరిస్తున్నట్టు అనిపించి, పాతవన్నీ జ్ఞాపకమొస్తాయి

వసంత ! చిన్న మల్లెలాంటి వసంత ! ఈ ప్రపంచానికీ మనుష్యులకీ దూరంగా యెక్కడో కలల్లో, తను కల్పించుకున్న స్వర్గాల్లో తేలిపోయే వసంత ! తను బతికేదే అతనికోసమన్నట్టు, అన్నిట్నీ మర్చి అతనిలో కలిసిపోయిన వసంతకీ, ఎదురుగా ఏ బెరుకూ ఉద్వేగం, అనుభూతి లేనట్టు పాలరాతి బొమ్మలా విలబడ్డ రాజేశ్వరికీ, పోలిక కుదరదు తన మనస్సు ఎటో పోతుంది ఏం మాట్లాడలేడింక

చిన్న చిన్న బెడ్డల్ని సరాగ్గా యేటి నీట్లో విసురుతూ బ్రతుకులో ఎన్నడూ మర్చిపోలేని ఆనెల రోజులూ మళ్లీ నెమరేసుకున్నాడు రావు

వసంతకు ఉన్నట్టుండి విపరీతంగా జ్వరం కాసింది మొదట్లో గాలి మార్పు అనుకొని, అంతగా పట్టించుకోలేదు కాని, నాలుగు రోజులైనా జ్వరం తగ్గుతుఖం పట్టలేదు సరికదా, ఒక సాయంకాలం నూట నాలుగుకి పెరిగింది

ఖంగారుగా, హడావిడిగా డాక్టరు దగ్గిరకి పరుగెత్తాడు రాజేశ్వరి ఆ చుట్ట పక్కలకంతకీ పేరుమోసిన డాక్టరు వయసులో చిన్నదైనా, చాలా తెలివైందని, ఆమెలాగ రోగ నిర్ణయం చెయ్యగలవాళ్లు లేరని, ఆమె మందు కెలాంటి రోగమైనా తగ్గాల్సిందే పని, ఒకవేళ తగ్గకపోయినా అదామె లోపం కాదని అంతా గట్టిగా నమ్మేవాళ్ళ

రోజు పొద్దున్నా, సాయంకాలం తను వెళ్ళకపోయినా ఆమే వచ్చి చూసేది. ఓ వారం రోజులకి జ్వరం నెమ్మదిగా తగ్గుముఖంపట్టి, వసంత మళ్లీ మామూలుగా మాట్లాడ్డం, నడవడం మొదలెట్టింది మర్నాడు పథ్యం ఇవ్వవచ్చని చెప్పి, ఏదో ఇంజక్షనిచ్చి వెళ్ళింది రాజేశ్వరి. ఇంక తను రానవసరం లేదని కూడా అంది.

కాని ఆ అదృష్టం దక్కలేదు తగ్గినట్టే తగ్గి, మళ్లీ ముదరబెట్టింది మర్నాడు అసలు మూసిన కన్ను తెరవలేదు వసంత పక్కమీద అటునుంచి ఇటు ఒత్తిగిలడానికే ఎంతో శ్రమ, బాధ పడుతున్నట్టు కనబడింది మళ్ళా రాజేశ్వరి రాక తప్పలేదు.

ఆ తర్వాత ఇరవై రోజులు వసంత ఎప్పుడూ సగం నిద్రలో ఉండేది రాజేశ్వరి పొద్దున్నా, సాయంకాలంవచ్చి, ఒకోసారి తనకి ధైర్యం చెబుతూ ఎన్నో గంటలు కూర్చొని పోయేది ఆమె కూడా తనతోబాటు శ్రమ పడుతున్నందుకు ఆ బాధలోనే ఎన్నో కృతజ్ఞత లందజేసుకున్నాడు రావు

రావు కా సంఘటనలన్నీ గుర్తు తెచ్చుకుంటూంటే, అప్పుడు తట్టని విషయాలు, దాని ఆలోచనలు, అనుమానాలు నెమ్మదిగా మెరవడం మొదలెట్టాయి

చివరి కా రోజు

తనతోబాటు రాజేశ్వరి కూడా పక్కనే ఉంది రాత్రి ఎనిమిది గంటల వేళ అతని శ్రమ, బాధ, ప్రార్థనలు, ఆశలు అన్నిట్నీనట్టేట్లో కలిపేసి తన దారి తను చూసుకుంది వసంత

ఆ తర్వాత చాలాసేపువరకూ రాజేశ్వరి వసంత పక్కనే కూలబడిపోయింది, తనతోబాటు ఆమె కళ్ళలో నీటిపొరలు మెరవడం స్పష్టంగా చూశాడు తను ఆనాడు ఆ పరిస్థితుల్లో ఆమె సౌహార్ద్రాన్ని, సానుభూతినీ తల్చుకుంటే కొంతలో కొంత ఊరట! ఈ లోకంలో తన కసలు నా అనేవాళ్ళు, తన బాధల్లో సుఖాల్లో పాలుపంచుకునేవాళ్లు అంతా కలిపి వసంత ఒక్కతేనని అనుకొనేవారు ఆమె రాలిపోయేక్షణంలో రాజేశ్వరి అడుగుపెట్టింది

కాని, అదంతా వట్టి నటన, మోసం, దగా అని నమ్మమంటూరు ఈనాడు చుట్టూ ఉన్నవాళ్ళు తననింతకాలం అసలు పట్టించుకోని మనుష్యులంతా తనమీద ఎంతో జాలి, సానుభూతి కురిపిస్తారు! అక్కర్లేని అర్థంలేని, సానుభూతి! తన ముందేదో పద్మవ్యూహ మల్లబడినట్టు, తను అమాయకుడై, గుడ్డిగా కళ్ళు మూసుకునందులోకి నడిచినట్టూ కల్పిస్తారు ఇదంతా తల్చుకుంటే మతిపోతుంది ఇంట్లోంచి పారిపోయి, దూరంగా ఏ కొండలమీదో, అడవుల్లోనో ఒక్కడూ సన్యాసిలా అయిపోవాలనిపిస్తుంది

బాగా చీకటి పడింది ఏవో శబ్దాలు చేసుకుంటూ, బారులుగా గూళ్ళకి తిరిగొస్తున్నాయి పక్షులు, పిట్టలూ దూరంగా ఏట్లో వలని గుచ్చి చేపల్ని పట్టుకున్నారు ఎవరో పల్లెవాడూ, పిల్లలూ పిల్లలెవరికీ వంటిమీద బట్టల్లేవ్వు అర్థడగు కూడా లోతులేని ఆ నీళ్లలో లడుగువేసి చిందిస్తూ వళ్లంతా

# వెలగని దీపాలు

మురికి చేసుకుంటున్నారు రావుకి కదలాలనే ఆలోచనే రాలేదు

పల్లెతను పైకొచ్చేస్తూ రావుకేసి ఎవరా అన్నట్టు చూశాడు

"చీకటి పడింది బాబూ! పురుగూ పుట్రా ఉండేను! ఇంటి కెళ్లండి"

అడక్కుండానే హితోపదేశం చేశాక, నారయ్య పోల్చుకున్నాడు, ఎవరైందీ ఒక్కసారి తడబడ్డాడు, "తమరా బాబూ!" అంటూ దూరంగా తొలగి కూలబడ్డాడు

"ఏం బాబూ, ఒక్కరూ చీకటేళ ఇలా వచ్చారు" నారయ్య అంతా పసిగట్టినట్టు, అతని బాధలో పాలు ఎంచుకునేట్టు జాలిగా అడిగాడు

రావు మాట్లాడలేదు ఏదో రకం ధ్వనిచేసి అదే సమాధానమన్నట్టు చూశాడు నారయ్య అతని వంకే పరిశీలనగా చూసి కాసేపు పోయాక మెల్లిగా అడిగాడు

"డాక్టరమ్మగారు బాగున్నారా బాబూ !"

"ఆఁ"

"మా దొడ్డ మడిసి దండమెట్టాలి మా తల్లికి" చేతులు కలిపాడు నారయ్య "అలాంటి మా తల్లినెక్కడా సూన్లేదు బాబూ దేవుడే, దేవుడే అలా దిగొచ్చినట్టనిపిస్తుంది " అతను క్రమక్రమంగా పొగడ్త మోతాదు హెచ్చిస్తుంటే రావుకి తన ఆలోచనల్నుంచి క్షణం విరామం దొరికినట్టయి, నవ్వొచ్చింది

"నీ కెప్పుడయినా మందిచ్చిందా !" చివరికి అడిగాడు

"నాక్కాదు బాబూ! ఈళ్లమ్మకి! వంటిమీద స్పృహ లేకుండా నూ గట్టి జ్వరం కాసిందండి అప్పుడా మాతల్లి సొంత మడిసిలాగ రోజూపొద్దంటా, సందేళా వచ్చి చూసి మామూలు మడిసిని చేయకపోతే ఈపాటికి చచ్చి ఎక్కడుండేదో! ఏం శాంతం, ఏం ఓపిక, ఎవరు చెప్పినా ఇనుకోకుండాయని, నీ దెప్పుడు ఇవాలో అంతా ఇవరంగా తెలిసేలా సెప్పి ఇప్పించేవోరు!" ముసలాడు ప్రవాహంలా చెప్పుకుపోయాడు

"డబ్బెంత పుచ్చుకుందేమిటి?" సగం వేళాకోళంగా అడిగాడు రావు

"రామ రామ! ఎంతో ఈడానికి మా దగ్గరేముంటది బాబూ! మే మిచ్చేదా యమ్మ క్కావాలా? అక్కడికీ ఏదో ఇయ్యబోయినం పుచ్చుకోనేలేదు . పుచ్చుకోక, మా దొడ్డమాటన్నారు బాబూ! ఎందుకు, ఎదవ బతుకెయ్యేళ్ల బతికి! ఆ యమ్మకున్న గ్యానం, ఇయేకం ఉంచాలి!"

"ఏమందేమిటి ?"

"నాకెందుకులే! సంసారం, పెళ్లాం, బిడ్డలు ఈళ్లందర్తోటే సుకంగ ఎలా నడుపుకు రావాలో తెలిసినోడివి నీకాడుండాలిగాని, అసలు మా బతుకులే సరిగ్గా నడుపుకోలేనోళ్లం, మాకాడ డబ్బుండేం పయోజనం? అన్నారండి కోటి రూపాయలు ఇలవజేసే మాట! నా కెప్పటికీ అదే గురుతుంటుంది

బాబూ! యెయ్యి జన్మలకైనా ఆయమ్మ ఋణం తీరదు!"

రావుకి గుండెలో కెలికినట్టయింది

"దండమండి బాబూ! ఈడే మా ఇల్లు! .. ఒరే! బాబుగోరికి దండమెట్టండిరా!" ముసలాడు వెళ్ళిపోతూ, పిల్లలచేత కూడా దండం పెట్టించాడు

రావు కేదో కొత్త వెలుగుని చూస్తున్నట్టయింది ఇరవై నాలుగ్గంటలూ రోగి దగ్గరేఉండి, ఆ ఆఖరి రోజు వసంతలో కాంతి నిలబెట్టాలని ఆమె పడ్డ ప్రయాస, చేసిన విశ్వప్రయత్నం అంతా కళ్లతో చూసి కూడా అర్థంలేని అనుమానాలకి, ఊళ్లో వాళ్ల ప్రచారానికి లొంగిపోయాడు!

రావు మెదడ్లోని సున్నితపు త్రాసులో అంత దాకా క్షణం స్థిరత్వం లేకుండా అటూ, ఇటూ ఒరుగుతున్న ముల్లు చివరి కొక్కసారి బలంగా ఒకే వైపుకి దిగలాగాడు నారయ్య ఇప్పుడే కళ్లతో వెనక్కి చూస్తే, రాజేశ్వరి తప్పు లేదనిపిస్తుంది

పైగా రాజేశ్వరి అలా కృశించిపోడానికి కారణం తనేనేమో! రావు కా సాయంకాలం రాజేశ్వరి అన్న మాటలు తాటికాయంత అక్షరాల్లో కళ్లెదుట నిల్చాయి

"నే నింకాశ్కే కాలం ఉంటానని తోచదు! . నా కసలు మొదట్నుంచీ అనుమానంగానే ఉంది నిన్న సర్జన్ కూడా అదే మాటన్నాడు! ఇలా మీతో ఏదో వెర్రిగా మాట్లాడుతూనే జారిపోతే బాగుణ్ను! గుండె జబ్బున్న వాళ్ల కెప్పుడు ముంచుకొస్తుందో చెప్పడం కష్టం!"

రావుకి లోపలేదో మంచు ముద్దచేరి, శరీరాన్నంతనీ కుంచుస్తున్నట్టనిపించింది చివరికీ రాజేశ్వరి కూడా వసంత—దారే చూసుకుంటే ఆ పాపం తనే కట్టుకోవాలేమో! రావు గబగబా లేచి ఇంటివైపు నడిచాడు

ఇంటికి చేరేసరికి రాత్రి పది కావస్తోంది

రాజేశ్వరి ఇంకా ఇంటికి రాలేదు

ఏం చేస్తుందింత సేపూ! ఎందు కిలా తిరగడం! హాస్పిటల్లో తన డ్యూటీ తను చేసుకుని ఇంటికి తిరిగి రాకూడదూ!

తన సంసారంలో తనకి దొరకని ప్రేమ, ఆనందం ఇతరచోట్ల, ఇతర సంసారాల్లో నిలబెట్టాలనా? రావుకి జాలి, బాధ రెండూ కలిసి నిలువునా కోస్తున్నట్టుంది

క్రిందేదో చప్పుడు రాజేశ్వరి వచ్చింది.

"ఏం వెంకన్నా! అయ్యగారి కన్నం పెట్టావా? పడుకున్నారా?" క్రింద వంటవాణ్ణి అడుగుతోంది

ఎందుకంత గట్టిగా మాట్లాడుతుంది? అసలే ఒంట్లో సరిగ్గా లేదుకదా! రావు విసుక్కున్నాడు ఆదుర్దాగా

రాజేశ్వరి పైకొచ్చి గదిలో లైటేసింది.

"మెలుకువగానే ఉన్నారా! ఇంత పొద్దు పోయిదాకా ఎందుకు చెప్పండి, అన్నం తినకుండా కూర్చోడం? చీకట్లో ఎలా కూర్చున్నా రింత సేపూ! లైటేను కోకపోయారా?" రాజేశ్వ రేదో అలవాటుకాని, తొందరలో బిగ్గరగా ప్రశ్న లడిగింది

కళ్లు బిత్తరపోయినట్టు కాంతిలేని చూపులు చూస్తున్నాయి లోపల్నుంచి కెరటాల్లా నెట్టుకొస్తున్నట్టు ఏదో తత్తరపాటు, తొందర!

రావు ఆ వింత ధోరణి చూస్తూ కూర్చొండిపోయాడు

నుదుటినిండా విపరీతంగా చెమటలు పోశాయి పెద్ద పనున్నట్టు హడావిడిగా అటూ, ఇటూ ఏమిటో మాట్లాడుతూ తిరిగింది కాసేపు 'రాక్' దగ్గిర నిలబడి, తువ్వాల్తో చెమట తుడుచుకొంది కాసేపు టేబిల్‌మీద స్టెత్‌ని చేతుల్లో మెలి తిప్పింది దేనికీ అర్థం కనబడదు కొద్దిగా తూలుతున్నట్టుంది

ఎన్నడూ ఏ ఒడుదుడుకులూ లేకుండా శాంతి దేవతలా కనబడే రాజేశ్వరిలో ఈ మార్పు రావుని చకితుణ్ణి చేసింది

"తమాషా చూశారా! చావు పొలిమేరల్లో నిలబడి ఈ బ్రతుకులో బావుకున్న దేమిటని, ఈ జీవితంలో, ప్రపంచంలో సుఖపడ్డాని కేముందని ఏడ్చే నేను, ఈ కుళ్లలోకే మరో కొత్త జీవిని ప్రవేశపెట్టాను!

చాలా సీరియస్ ఆపరేషన్! పోనీలెండి! ఈ ఆఖరి క్షణాల్లో రెండు నిండు ప్రాణాల్ని కాపాడానన్న తృప్తైనా మిగిలింది అదే చాలు!" రాజేశ్వరి తనలో తానే అనుకొంటున్నట్టు వడివడిగా చెప్పుకుపోతూంది

బాగా అలిసిపోయిందేమో! మూడు నాలుగ్గంటలు ఆత్రంలో, ఆవేదనలో గడిపేసరికి అసలే నీరసంగాఉన్న గుండె అలిసిపోయుంటుంది!

రావు ఒకమాదిరి దిగ్భ్రమలో ఆమెవంక తదేకంగా చూసి, తేరుకున్నాక, ఆమెని నెమ్మదిగా కుదుట బర్చాలని లేవబోయాడు

తువ్వాల్తో మెడమీద చెమట తుడుచుకుంటున్నదల్లా, ఒక్కసారి తూలి, మట్టిబొమ్మ నెవరో తోసినట్టు, వచ్చి మంచంమీద పడిపోయింది రాజేశ్వరి

రావు తడబడ్తూ, ఇంట్లో వాళ్లందర్నీ పిలిచాడు

రాజేశ్వరి మాట్లాడకుండానే అతన్ని చెయ్యి పట్టుకుని కదలవద్దని ఆపుచేసి, "డాక్టర్ని పిలవకండి, అనవసరం" నీరసంగా అంది కళ్లు మూసుకున్నాయి

"నే నే పాపం ఎరుగను, నా మాట నమ్మండి" అంటున్నట్టు శబ్దం ఏదీ బయట పడకుండానే ఆమె పెదాలు కదిలి, శాశ్వతంగా విశ్రాంతి పుచ్చుకున్నాయి.



# సాహితీ చక్రవర్తులు

21—వ పేజీ తరువాయి

ప్రేమలో అమర్చిన తెల్లటి అద్దాల్లోంచి ధ్యాన ముగ్నుడై ఉన్నట్లుగా చూస్తూ, ఒక చేతిలో ఏదో పుస్తకం, మరో చేతిలో గొడుగుకర్రలా ఉన్న చేతి కర్రను అడుగడుక్కూ నేలపై పోటీగా ఉంచుకొని, తమవేపే నడిచి ఒస్తున్న ఓ పెద్దతరహా మనిషి, అతని పక్కనే అడుగులో అడుగువేసుకుంటూ వస్తూన్న భాస్కరం వాళ్ళకి కనిపించారు

'స్వాగతం ! సుస్వాగతం !' అన్నారు ముగ్గురూ! భాస్కరం, ఆ నూతన వ్యక్తి దగ్గరికి రాగానే దిగ్గున లేచి ముక్తకంఠంతో

భాస్కరం వినయవిధేయలతో ఆయనకు పార్కులో బెంచి చూపించాడు ఆయన మౌనంగా నడిచి వచ్చి, సిమెంటు బెంచీమీద కూచున్నారు ఆయన కెదురుగా కింద పచ్చికమీద నెమ్మదిగా కూచున్నాడు భాస్కరం తక్కిన ముగ్గురూకూడా యాంత్రికంగా ఒకే వరసలో భాస్కరంపక్కనే కూచున్నారు

పెద్దమనిషి ముందు ఒక్కసారి గంభీరంగా ఆకాశంలోకి చూచి, తదుపరి తల దించి, భాస్కరం మీదికి దృష్టిమళ్ళించి, ప్రసన్నవదనంతో తక్కిన ముగ్గుర్నీ చూస్తూ చిరునవ్వుతో ఇలా అన్నారు :

'భాస్కరంద్వారా మిమ్మల్నిగురించి పూర్తిగా తెల్సుకున్నాను ఈ రోజు మిమ్మల్ని కల్సుకొన్నం దుకు నాకు చాలా ఆనందంగా ఉంది !'

మాధవ్‌కి ఇదంతా ఏదో గజిబిజిగా ఉంది

'ఇంతకీ తమరెవరో తెల్సుకోవచ్చా ?' అన్నాడు ఉండబట్టలేక

'నా విషయం కొద్ది నిముషాల్లోనే భాస్కరం మీకు తెలియపరుస్తాడు ఇంతలో నేను రెండు ముక్కలు మాట్లాడదల్చుకొన్నాను మీకేమన్నా అభ్యంతరమా ?' అన్నాడా పెద్దమనిషి !

'లేద'న్నట్టు ముగ్గురు తలలు ఊగాయి

ఆయన చెప్పటం ప్రారంభించారు :

'ఆరోజు సాయంకాలం ఐదుగంటలైంది కొంతమంది రిక్షాలో ఓ కుర్రవాణ్ణి కూచోబెట్టుకుని నా దగ్గరికి తీసుకొనివచ్చారు అప్పుడా కుర్రాడు మాటాడలేని స్థితిలో ఉన్నాడు 'ఏమైంది?' అనడిగాను 'ఏమోనండి షికారుకని అలా పొలాలవేపుగా వెళ్ళివచ్చి— ఏదో గుండెల్లో బరువుగా ఉన్నదంటూ మైకం కమ్మిపడిపోయాడు' అన్నారు కుర్రాణ్ణి రిక్షాలోంచి ఇంట్లోకి తీసుకురమ్మని చెప్పి మంచం పైన పడుకోబెట్టించాను దగ్గరగా వెళ్ళి చూచాను బాగా పరిచయమున్న ముఖంలాగే కనిపించింది: 'పాపం ఏదో కరిచిందని అనుకొంటున్నారుకదూ ? అలాంటిదేమీ కాదు ఎక్కణ్ణుంచో చాలా దూరంనుంచి పరిగెత్తుకుని వచ్చినట్టున్నాడు అలుపువచ్చి సొమ్మసిల్లి పడిపోయాడు అంతే ! త్వరలోనే తేరుకుంటాడు ఇక్కడే ఉంచి కొంచెం సేపు విశ్రాంతి తీసుకోనివ్వండి' అన్నాను కొంచం సేపయ్యాక కుర్రాడు స్మృతిలోకి రావటం మొదలెట్టాడు దగ్గరగా వెళ్ళి చూచాను ఏదో కలవరిస్తున్నట్టుగా ఉంటే చెవి దగ్గరగా పెట్టి విన్నాను. అంతే! అతన్ని గురించి నాకుపూర్తిగా తెల్సిపోయింది వెంటనే ఇంట్లోకి వెళ్ళి కొంచెంసేపయ్యాక వచ్చి— 'అబ్బాయ్ ! నీ కథ పత్రికలో పడింది !' అన్నాను దగ్గరగా అతని చెవిలో అంతే! అతను దిగ్గున లేచి కూచున్నాడు తర్వాత మామూలుగా అందరితో మాటాడ్డం మొదలెట్టాడు ఆ రోజు పెద్దవాళ్ళు ఇంటికి తీసుకునివెళ్ళినా, మర్నాడు మా ఇంటికి వచ్చి నాతో మాట్లాడిన ఆ కుర్రాడు నా కత్యంత సన్నిహితుడయ్యాడు. అతను ఎవరో తెల్సుకోవాలని మీరు ఉబలాట పడుతున్నట్టుగా మీ ముఖాలు చూస్తేనే తెలుస్తోంది ఈ విషయంకూడా భాస్కరమే ఇప్పుడు మీకు తెలియపరుస్తాడు' అనేసి భాస్కరంవేపు వాత్సల్యంతో చూస్తూ—'అబ్బాయ్! ఇదంతా ఏమిటో తెలీక నీ మిత్రులు తికమకపడుతున్నట్టున్నారు ఇటు వచ్చి రెండు ముక్కలు చెప్పు!' అన్నారు తమ సంభాషణ ముగిస్తూ

'వీరు ప్రఖ్యాత రచయిత 'స్వామీజీ'గారు అనేకపత్రికల్లో వీరి పేరు తరచుమీరు చూస్తూనే ఉంటారు వీరు ప్రస్తుతం ఈ ఊళ్ళోనే ఉంటున్నారు వృత్తి : వ్యవసాయం ఉపవృత్తులు వైద్యం, మంత్రాలు వెయ్యడం హాబీలు : రచనలు చేయడం లేక అలాంటి కళలు ఏవైనా నేర్చుకునేవాళ్ళను ప్రోత్సహించడం ఊరి బయటనుంచి వేగంగా పరిగెత్తుకుని రావడంలో స్పృహలేకండా పడిపోయిన ఓ కుర్రాణ్ణి ఎలా తమసమయస్ఫూర్తితో ఈ ఈ ప్రపంచంలోకి తీసుకువచ్చింది మీరువిన్నారు ఆ కుర్రాణ్ణి నేనే నాకు స్వామీజీ నిజంగా ప్రాణదానం చేశారు తర్వాత నా అభినివేశాలు ఏమిటో కనుక్కొని తమ అమూల్యమైన సలహాలిస్తూ నన్ను ప్రోత్సహిస్తున్న 'స్వామీజీ'గార్ని నా గురుదేవులుగా ఎంచుకొన్నాను మీరు నా ప్రాణస్నేహితులు కనుక ఇక్కడికి తీసుకునివచ్చి, మీకు పరిచయం చేశాను మీకు సందేహా లేమన్నాఉంటే అడగండి!'' అంటూ ఓ ఉపన్యాసం దంచి కూచున్నాడు భాస్కరం

'అయ్యా ఇంతకీ మావాడు రచయిత అనే విషయం మీ రెలా పసికట్టారు ?' అనడిగాడు శేఖరం— భాస్కరం కూచోగానే, అందాకా ఆ ప్రశ్న అడగటానికి వేచి ఉన్నట్టుగా

స్వామీజీ గుండెలదాకా పెరిగి పండిన గెడ్డం సవరించుకొని—'సాధారణంగా భగ్నప్రేమికులూ, భావకవులూ, ఎన్నికల్లో ఓడిపోయిన రాజకీయవాదులూ, రేగిన జుట్టుతో, చిరిగిన బట్టలతో ఏదో పోగొట్టుకొన్నది అన్వేషిస్తున్నట్టుగా కనబడుతూ ఉంటారు భాస్కరం వయస్సు అతన్ని అటు భగ్నప్రేమికుడుగా కాని, ఇటు రాజకీయవాదిగా కాని ఊహించడానికి వీలులేని స్థితిలో ఉంది కనుక ఇతను తప్పక సాహితీ రంగంలో ఇప్పుడిప్పుడే అడుగుపెడుతూన్న రచయిత అయిఉంటాడని ఊహించాను అందులో నా దగ్గరికి తీసుకొనివచ్చినప్పుడు భాస్కరం— 'కథ తిరిగివచ్చింది !' అని ఏదో కలవరిస్తున్నాడు దాంతో నా ఊహ నిజమైన అసలు సంగతి పసికట్టాను' అని సందేహ నివృత్తిచేశారు స్వామీజీ!

ఇంకా ఏమన్నా సందేహాలుంటే అడగమన్నట్టుగా తక్కిన ముగ్గురివంకా చూశాడు భాస్కరం !

# సాహితీ చక్రవర్తులు

'మా సంగతి మీ కిప్పటికి పూర్తిగా తెలిసే ఉండ వచ్చు! ఇంతకీ మా 'రాతలు' వెలుగులోకి వచ్చే అవ కాశం లేదంటారా ?' అన్నాడు సుధాకర్ !

'ఆ విషయమే భాస్కరంకూడ నన్నడిగాడు ప్రస్తుతం మీ దగ్గరున్న రచనలన్నీ భాస్కరంతో పంపండి, వాట్ని క్షుణ్ణంగా చదివి చూచి 'వారం రోజుల్లో వాటిలోని లోటుపాట్లు చెప్పి కథారచనలో కొన్ని మెలుకువలు చెప్తాను ' అన్నారు స్వామీజీ

'రేపే మా రచనలన్నీ భాస్కరంతో పంపుతాం' అన్నాడు మాధవ్ అందరి తరఫునా

'తప్పకుండా పంపండి త్వరలోనే మళ్ళా కల్సుకొందాం'' అంటూ లేచారు స్వామీజీ !

'మమ్మల్నికూడ భాస్కరంలాగే తమ శిష్యులుగా భావించి దయతో మా రచనలు పరిశీలించండి' అని నాలిక కరుచుకొన్నాడు శేఖరం, తన మాటలు తనకే పేలవంగా ఉన్నట్లు తోచి

ముఖంమీద వెలిసిన చిరునవ్వుతో శిష్యులు నలుగురూ వెంట రాగా మెల్లిమెల్లిగా పార్కులోంచి నిష్క్రమించారు స్వామీజీ !

* * *

'హలో !'

'హలో !'

'హలో !'

ఆరోజు సాయంకాలం పార్కులోకి రాగానే ఒక ర్నొకరు పలకరించుకుంటున్న శేఖరం, సుధాకర్, మాధవ్‌లు నాలుగో— 'హలో'— వినిపించకపోయే సరికి టక్కున ఆగిపోయారు ఒకసారి పార్కు అంతా కలయజూచారు

'సోదర రచయితలూ !— 'దాశరథి'— చిరు దొంకితుడైన మన భాస్కరంగాడు రాలేదేంచెప్మా! అన్నాడు శేఖరం

'వాడు గురుజీఅయిన 'స్వామీజీ' గారితో కాని కలిసిరాడు' అన్నాడు సుధాకర్

'పక్షికే ! దేవుడు వరమిచ్చినా పూజారి వరమియ్యనట్లుగా మొన్న రచనలు తీసికెళ్ళినప్పుడు స్వామీజీ ఇంటికెళ్ళి— మనమే స్వయంగా అవన్నీ ఆయనకి అందజేసుకుని మనగోడు, చెప్పుకుంటామంటే ఒప్పుకున్నాడూ!' అన్నాడు మాధవ్ తన అక్కసులంతా వెళ్ళగక్కుతూ

'వాడు ఉత్తి వెధవ అయ్యాడు' అన్నాడు సుధాకర్

'అదేలా ?' అనడిగాడు శేఖరం

'అందరికీ మంచిగా ఉంటూ, ఇతరులకు సహాయం చేస్తూ ఎవడన్నా ఉంటాడు చూశావ్ ! వాణ్ణి వరూ తొరగా మంచివాడనరు అదే వాడి పనేదో వాడు చూచుకొంటూ, వాడి గొడవేదో వాడు పడుతూ ఎవడి మంచి వాడు చూచుకుంటుంటాడు చూశావ్, వాణ్ణి వెంటనే 'వెధవ' అనేస్తారు ' అని విశదీకరించాడు సుధాకర్

'అబ్బ ! ఏం మాక్కులు వస్తున్నాయిరా నీ నోటి నుంచి ఈ మధ్య నాకే గనక అవకాశం అధికారం ఉంటే నువు చెప్పిన ఈ నాలుగువాక్యాలకూ ఈ సంవత్సరం 'నోబెల్ బహుమానం' నీకే ఇచ్చేద్దును ' అన్నాడు శేఖరం

'ఎందుకురా తొందరపడతావ్ ! ఇవాళ 'స్వామీజీ' గారు రాగానే మన భవిష్యత్తు అంతా తేలిపోతుందిగా ఒకవేళ నోబెల్ బహుమానం పొందిన ప్రథమాంధ్ర రచయితను నేనే అవుతానేమో' అన్నాడు సుధాకర్

'అరుగో రానే వచ్చారు గురు శిష్యులు' అన్నాడు మాధవ్ ముందుకి చూస్తూ !

భాస్కరాన్ని వెంటపెట్టుకుని వచ్చిన స్వామీజీ మెల్లిగా నడుచుకొంటూ వచ్చి, మామూలు ప్రకారం పార్కు—బెంచీమీద ఆసీనులయ్యారు ఆయన కెదురుగా ఒకే సరళరేఖలో కూచున్నారు శిష్యులు నలుగురూ ! కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచాక స్వామీజీ తమ మౌనం భంగపరుస్తూ ఇలా అన్నారు

'నాయనలారా ! బుద్ధిగా చదువుకొని కాలేజీలో ప్రవేశించారు మీరు పెద్దల అండ ఉంది బుద్ధి కుదిరి చదువుకుంటే పైకి పోగల అవకాశాలున్నాయి ముక్కుపచ్చలారని మీరు, ముఖాలు మాడ్చుకొని గడ్డాలు పెంచుకుని, చినిగిపోయిన బట్టలతో తిరుగుతూ, సందర్భశుద్ధి లేని రాతలు రాస్తూ మీ ఆలోచననూ, కాలాన్ని ఎందుకు వృథాచేస్తారు? మిమ్మల్ని నా పిల్లలుగా భావించి చెబుతున్నాను వినండి మీరు చేసేదంతా వృథాప్రయాస మీ రచనలన్నీ బాగా లేవని నేనన్ను కాని సంతృప్తికరంగా మాత్రంలేవు నా మాటలు వినండి కాలాన్నిలా వ్యయపరచకండా శుభ్రంగా ఉంటూ శ్రద్ధగా చదువుకోండి మీ బాగు కోరి నేనూ చెబుతున్నాను నా మాటలు ఈ సమయంలో మీ మనసుకు కష్టం కల్గించవచ్చు ! కాని నేచెప్పిన ఈ మూడుముక్కలూ నిజమవునో కాదో బాగా ఆలోచించి చూడండి మీకే బోధపడుతుంది ఇంతకంటే నేను మీకు చెప్పేదేంలేదు సెలవ్ !'

> "నవలలు, కథలు రాయాలనే కోర్కె కలిగి విఫల మనోరథుడై దరిమిలాను పుంఖాను పుంఖాలుగా విమర్శలు సాగించి, తన డెబ్బయ్యో యేట మరణిస్తూ ఒక ప్రసిద్ధ రసజ్ఞుడు నవలలు రాద్దామనుకుంటున్న తన మనుమడికి ఇచ్చిన సలహా: "నవలలు రాయాలనిపించి చేతకాకపోతే ఆత్మహత్య చేసుకో గాని అనక విమర్శలు చేసి, నీ మరణాన్ని మరింత నరకబాధగా చేసుకోకు" అని.
>
> ఎమ్. సోమనాథ్ (నూజివీడు)

అలా చెప్పేసి స్వామీజీ అనుకోనట్టుగా లేచి భాస్కరంతో సహా బయటికి వెళ్ళటానికి ఉద్యుక్తులయ్యారు.

శేఖరం, సుధాకర్, మాధవ్‌లకు తామంతా ఓ కలలో ఉన్నట్టుగా తోచి ఓసారి ఒకర్నొకరు గిల్లుకుని చూచుకొని, అది కల కాదని, వాస్తవంలో ఉన్నామని తెల్సుకొని ఏక కంఠంతో— 'అయ్యా ! మా అమూల్య సందేశానికి మా ధన్యవాదాలు దయచేసి మా రచనలు మాత్రం మా కిప్పించండి అన్నారు స్వామీజీతో

'అవి ఎప్పుడో అగ్నిహోత్రుడికి సమర్పిత మయ్యాయి ' అని స్వామీజీ చకచకా బయటికి వెళ్ళిపోయారు భాస్కరంతో సహా !

దాంతో, నట్టనడిసముద్రంలో పడినవాడికి తుఫాను కూడ తోడైనట్టుగా— 'హరహరా !' అంటూ కుప్పగా కూలిపోయారు శేఖరం, సుధాకర్, మాధవ్‌లు ముగ్గురూ

* * *

రెండుమూడు నెలలయ్యాక ఓనాడు శేఖరం, సుధాకర్, మాధవ్‌లు ముగ్గురూ, భూతలాన్ని పరిశోధనచేస్తున్నట్టుగా తలలు దించుకొని మౌనంగా ఏదో ఏదో తీవ్రాలోచనచేస్తూ పార్కులో ఓ మూలగా కూచుని ఉన్నారు

కొంచెం సేపయ్యాక ఎవరో పక్కనే వచ్చి కూచున్నట్టు అలికిడి అయి ముగ్గురూ ఒక్కసారిగా వంచిన తలలు పైకి ఎత్తారు వెంటనే ఎదురుగా కూచుని ఉన్న భాస్కరంమీద పడి—ఏమేమో చేద్దామనుకున్నారు కాని, అతని దీన వదనం చూచి అసలు నానే శారు భాస్కరం కనబడితే చాలు, పట్టుకు దులిపేద్దామనే తలంపుతో కొన్ని ఘాటైన డైలాగ్సు కూడ ఎన్నుకొని వాగ్యుద్ధానికి తయారుగా కూచునిఉన్న ఆ ముగ్గురికీ కనీసం మాట్లాడే అవకాశం కూడ ఇవ్వకుండా అక్కడికి వచ్చి కూచున్న తక్షణమే ఆకాశంలోకి చూస్తూ (అప్పుడు తామున్న పరిస్థితిలో వాళ్ళ ముఖాల్లోకి తిన్నగా చూడలేక) ఏదో ఆవేశంలో తన సంభాషణ మొదలెట్టాడు భాస్కరం !—

'ఇలా జరుగుతుందని అనుకోలేదుర్రా మీ కథలన్నీ కాజేసి, మార్చిరాసి, మారుపేరుతో పత్రికలకు పంపుదామని నాటకాల 'నరహరి'తో— 'స్వామీజీ'—గా నాటకం ఆడించాను, కాని మీరు నా కిచ్చిన కథలన్నీ వాడే తస్కరించి నాకే నామాలు పెట్టేశాడు 'సంగ్రాహి' పేరుతో ఈమధ్య పత్రికల్లోవచ్చిన కథలన్నీ నరహరిగాడు మనదగ్గర హరించినవే ! ఆరోజు నేను పడిపోయినట్లూ— వాడు నాకు ప్రథమచికిత్స చేసినట్లు వాడిచేత చెప్పించిందంతా వట్టి కల్పనే ! ఇదంతా అయింది నావల్లనే జరిగింది జరిగినట్టు చెప్పాను. ఇక నన్ను మీరు ఏంజేసినాసరే!' అంటూ భాస్కరం తన సంభాషణ ముగించి, ఆకాశంలోనిల్పిన తన చూపులు, కిందికి దింపి, ఎదురుగా చూశాడు

అతన్ని ఏమైనా చెయ్యటానికి అక్కడ ఎవరూ లేరు పార్కులో ఏత్తుగా పెరిగిన గడ్డిమీద బల్లపరుపుగా పడిపోయిఉన్న అతని ముగ్గురు మిత్రులు మాత్రం కన్పించారు భాస్కరానికి

'అయ్యో ! ఎంతఘోరం జరిగిపోయింది' అనుకొంటూ పార్కులో ఓ మూలగాఉన్న పంపు దగ్గరికి—పరిగెత్తాడు భాస్కరం నీళ్ళకోసం !

ధర్మ రహస్యం అణువంతయినా తన కవగాహన కాలేదని యజ్ఞమూర్తి కనిపించింది! ఆ విషయంలో తన అనన్య సామాన్య పాండితి ఎందుకు కొరగాక, కేవలం వ్యర్థమై పోయినదని గుర్తించి ఉసూరుమని నిశ్వసించాడు

యజ్ఞమూర్తి అద్వైత వేదాంత పరమార్థమనదగిన మాండూక్యోపనిషత్తు కూలంకషంగా మథించి ఆమూలాగ్రంగా అవగాహన చేసుకొన్నాడు కూలాగ్రంవంటి సునిశిత మేధాసంపత్తికల మహామనీషికే పరమాత్మస్వరూపం సమగ్రంగా అవగాహన కాగలదని ఆ ఉపనిషత్తు అడుగడుగునా నొక్కి వక్కాణించింది! ఆచార్యుని సాన్నిధ్యం చేరుకోక పూర్వం అతడదే ప్రస్థానం అనుసరించాడు అటువిమ్మట భక్తి ప్రపత్తుల యెడల పరమ గౌరవం కుదిరినా అతని కావూర్వ ధోరణి పూర్తిగా నశించలేదు! అందుచేత రంగనాయకునివంటి పామరుని కంతటి అదృష్టం కలిగినదని వినగానే అకస్మాత్తుగా అతని కేదో పెద్ద ఆఘాతం తగిలినట్లయింది!

ఆపైన ఏడెనిమిదిరోజులు గడిచిన తరువాత అతని కొక విషమ సమస్య ఎదురుపడింది ఎన్నెన్ని విధాల తల బ్రద్దలుకొట్టుకున్నా యజ్ఞమూర్తి కది రవంతయినా అవగాహన కాలేదు! అందుచేత విద్యావయోవృద్ధుడు గోవిందయతితో ఒకసారి సంప్రదించవలెనని నిర్ణయించుకొన్నాడు ఇటీవల ఆ వృద్ధమూర్తి అకస్మాత్తుగా మౌననిష్ఠ విడిచి పెట్టినట్టు విన్నాడు నెమ్మదిగా పూలతోటవైపు సాగిపోయాడు

అప్పటికి మూడు జాముల పొద్దు తిరిగింది గోవిందయతి ఆనాడు తోటలో సురపొన్న నీడలో పసిరి పచ్చికమీద కూర్చుని ఏకాగ్రదృష్టితో దేవరాజస్వామి కొక పొన్న పూలమాలిక అల్లుతున్నాడు అతని చుట్టూ ఒత్తుగా రాలిన సురపొన్న పూలతో ఆ పరిసరంలో నలుమూలల వేర్వేరు రీతుల రంగవల్లిక లేర్పడ్డాయి అల్లంతదూరంలో నుండి సన్నని తంబురా శ్రుతి వంటి సన్నని గండు తుమ్మెదల సవ్వడి వినిపించింది

యజ్ఞమూర్తి ఎంతో అణకువతో గోవింద యతి సరసన కూర్చున్నాడు ఆ వృద్ధయతి కొంచెం తల పైకెత్తి తన మాలిక అల్లిక కొంత నిలిపి బొమముడి విరిచి ప్రశ్నించాడు:

'ఇదేమిటి? ఎంతో పనివేళ వచ్చావే! విశేషాలేవయినా ఉన్నాయా!'

యజ్ఞమూర్తి ఉసూరుమని నిశ్వసించాడు 'లేకేమి! హేమసుందరీ రంగనాయకుల మంత్రోపదేశం వ్యవహారం యావత్తు విన్నారుగదా! ఆచార్యుల అనుగ్రహదృష్టి అంతటితో ఆగలేదు'

గోవిందయతి అలవోకగా చిరునవ్వు చిందించి ప్రశ్నార్థకంగా బొమముడి విరిచి యజ్ఞమూర్తి ఆందోళన వైఖరి పరిశీలించాడు అంతలోనే అతడందుకొన్నాడు

'విశిష్టాద్వైత ప్రస్థాన వ్యాప్తికోసం భరతవర్షంలో అంతటా డెబ్బయి అయిదుగురు పీఠాధిపతుల నేర్పరచవలెనని ఆచార్యు లిటీవల సంకల్పించుకొన్నారు! వారిలో రంగనాయకు డొకడు! నా కీ విషయం ఈవేళ ఉదయమే తెలిసింది!'

# విశాల నేత్రాలు

19 వ పేజీ తరువాయి

ఆ వృత్తాంతం వినగానే గోవిందయతి ముఖంలో విపరీతమయిన ఆశ్చర్యావేశం పొడగట్టగలదని అతడెంతో ఆత్రంతో నిరీక్షించాడు కాని అటువంటిదేమి గోచరించలేదు యజ్ఞమూర్తి రవంత ఆశ్చర్యపడి తిరిగి తన ప్రసంగం కొనసాగించాడు:

'అంతేకాదు నన్నే వెళ్ళి ఈ విషయంలో రంగనాయకుని అనుమతి సంపాదించవలసినదని ఆదేశించారు దీనికి నే నేమి ఆశ్చర్యపడలేదు అయితే పరమ బ్రహ్మణ్యులయిన మహా విద్వాంసులు మాత్రమే అధిష్ఠించవలసిన శ్రీ వైష్ణవపీఠం రంగనాయకుని వంటి అజ్ఞాని కందిస్తున్నారే అని ఎంతయినా మథనపడ్డాను ఇది విన్నప్పటినించి నాకు మతిపోయినట్టయింది! కొంచెం సాహసించి ఆచార్యులతోనే ఈ విషయం చూచాయగా ప్రస్తావించాను వారది ఆలకించనట్టు మాట్లాడ కూరుకొన్నారు దీనిలో గల పరమార్థమేమో నా కేమాత్రము బోధపడలేదు!'

అయినా గోవిందయతి ముఖంలో యజ్ఞమూర్తి నిరీక్షించిన మహాశ్చర్యరేఖ పొడకట్టలేదు మౌనముద్ర మాత్రమే రవంతసేపు స్థిరపడింది అంతలోనే అధరంపై చిరునవ్వు చెంగలించింది:

'నాయనా! యజ్ఞమూర్తీ! దీనిలో నాకంతటి విడ్డూరమేమి కనబడలేదు ఆచార్యుల మనుగడలో చాలాకాలానికి పూర్వమే ఒక మహాద్భుతం జరిగింది నీ వది విని ఉండలేదేమో! లేకపోతే నీ కింతటి మథన కలగదు'

'నే నెన్నడు వినలేదే! ఏమా సంఘటన!'

యజ్ఞమూర్తి ఎంతో ఆశ్చర్యపడి ప్రశ్నించాడు గోవిందయతి ప్రసన్న ముఖవైఖరితో తిరిగి తన ప్రసంగం ప్రారంభించాడు:

'ఆచార్యుల కిప్పుడు అరవైనాలుగవ ఏడు నడుస్తున్న దనుకుంటాను అంటే ఇది ఇంచుమించుగా ముప్ఫయి ఏళ్ళ క్రితం జరిగినదన్నమాట! రామానుజుల గురువరేణ్యులు గోష్ఠీపూర్ణులు ఒకప్పుడు గోష్ఠీపురంలో మొట్టమొదటగా అష్టాక్షరీ మంత్రం యథావిధిగా అంతేవాసి కుపదేశించారు ఆపైన 'నాయనా! ఇది మహాద్భుతమయిన మంత్రరాజం సుమా! ఇది ఆలకించినంతలోనే ఎంతెంతటి మహాపాతకాలయినా క్షణంలో పటాపంచలయిపోగలవు! అనతికాలంలోనే శ్రీ మహావిష్ణుసాయుజ్యం కరతలామలకం కాగలదు! అయితే అనర్హులకెవ్వరికీ ఇది ఉపదేశించరాదు ఈ కట్టడి అతిక్రమిస్తే తప్పక ఘోర నరకం సంప్రాప్తించగలదు సుమా!' అని హెచ్చరించారు ఆపైన ఏమి జరిగిందో తెలుసునా?'

యజ్ఞమూర్తి ఆ ప్రశ్న కేవిధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు ఇనుమడించిన జిజ్ఞాసతో తదనంతర వృత్తాంతం కోసం నిరీక్షించాడు అంతలోనే గోవిందయతి తన అపూర్వగాథ తిరిగి ప్రారంభించాడు:

'రామానుజులా సాయంకాలమే గోష్ఠీనగరంలో గోపాల దేవాలయం సమున్నత గోపురం పై అంతస్తుమీద నిలిచి 'ఇదిగో పెన్నిధి! రండి రండి!' అని బాటసారుల నందరిని గొంతెత్తి పిలిచి ఆ మంత్రం స్వీకరించవలసిందని దోసిలికట్టి వేడుకొన్నారు! తమ యావచ్ఛక్తి వినియోగించి ఆ మంత్రం గభీర మధుర స్వరంతో మాటిమాటికి ఎలుగెత్తి ఉచ్చరించారు ఆనాడు కొన్నివేల మంది గోష్ఠీనగర పౌరులా మంత్రాక్షరాలన్నీ విస్పష్టంగా ఆకర్ణించారు'

యజ్ఞమూర్తి నిలువునా నిర్ఘాంతపోయాడు:

'మరి గోష్ఠీపూర్ణులు వారి నడ్డుకోలేదా?'

'అడ్డుకోకేమి! అడ్డుకొన్నారు 'ఎంతపని



లేశా విశేషం ! అయ్యో ! నాయనా ! నీకిక ఘోర నరక దుర్గతి తప్పదు !' అని హెచ్చరించారు.

'దానిమీద ఆచార్యు లేమన్నారు ?'

ఎంతో ఆత్రంగా ప్రశ్నించాడు యజ్ఞమూర్తి.

'అదే చెబుతున్నాను విను! ఆయన ఎక్కడా చెక్కు చెదరలేదు ఎంతో అరకువతో దోసిలికట్టి నిలిచి 'పోనీయండి! నా కొక్కడికేకదా ఆ ఘోర నరక దుర్గతి ! ఆమంత్రం విన్నవారందరు పాపవిముక్తులై స్వామి సాయుజ్యం చేరుకొంటారు కదా! నా కదే పదివేలు!' అని ఆ గోష్ఠీపూర్ణుల పాదాలపై వాలి పోయారు '

యజ్ఞమూర్తి ఆ మహోద్భుత వృత్తాంతం విని తిరిగి క్షణకాలం నిలువునా నిర్ఘాంత పడ్డాడు గోవిందయతి అది గమనించి అల్పన నవ్వి ప్రసంగించాడు :

'యజ్ఞమూర్తీ ! ఇదేదో మహాద్భుత వృత్తాంతమని ఆశ్చర్యపడుతున్నట్లున్నావు ! ఆచార్యుల మనుగడలో ఇంతకన్న అత్యద్భుత వృత్తాంతాలున్నాయి అద్వైత వేదాంతనిధి యాదవప్రకాశులవద్ద రామానుజులు బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు భగవద్గీత శంకర భగవత్పాదుల భాష్యాలతోపాటు పఠించారని నీ వెరుగుదువు కదా ! ఆ సమయంలో కొన్నికొన్ని ఉపనిషద్వాక్యాలకు రామానుజులు విశిష్టాద్వైతపరములయిన వినూత్నవ్యాఖ్యానాలారంభించారు యాదవ ప్రకాశుల కది సుతరామూ రుచించలేదు కాని క్రమక్రమంగా రామానుజుల వ్యాఖ్యానమే సముచిత మయినదని మహావిద్వాంసులు కొందరు సమర్థించారు అందువల్ల ఆయన పట్టరాని దురాగ్రహంతో ప్రజ్వలించారు వారణాసీయాత్ర మిషతో రామానుజుల నకస్మాత్తుగా చంపించి వేయవలెనని శాయశక్తులా ప్రయత్నించారు దైవానుగ్రహంవల్ల ఆచార్యులా ఘోరాపద గడిచి గట్టెక్కి ప్రాణాలతో బయటపడ్డారు ఆ తరవాత యాదవ ప్రకాశుల కుతంత్రం వారి కామూలాగ్రంగా అవగత మయినది అయినా రామానుజు లేమాత్రము ఆయన యెడల ఆగ్రహించ లేదు పైగా మరికొంతకాలం గడిచిన తరవాత అంతేవాసిగా స్వీకరించారు !'

యజ్ఞమూర్తి కా గాథ మరింతగా ఆశ్చర్యం కలిగించింది తిరిగి గోవిందయతి అలవోకగా చిరునవ్వు చిందించాడు

'ఇంకొక్క చిన్న విషయం వింటే బాగా వగబట్టిన ప్రాప్పుడెంత నయినా వారి వైఖరి ఎటువంటిదో నీకు [illegible] కాగలదు శ్రీరంగ దేవాలయంలో ఇంతకుమునుపున్న ప్రధానార్చకు లెవరో నీ వెరుగుదువు కదా ! ఆయన నానాటికి నలువైపుల వ్యాపిస్తున్న రామానుజుల అపూర్వ ప్రతిష్ఠ సహించలేక కడుపులో [illegible] పోయుకున్నాడు ఆచార్యుల నెలా [illegible] రూపుమాపివేయవలెనని నిశ్చయించుకొని [illegible] లాయన అన్నపానాలలో విషం కలిపించాడు చిట్టచివరి కా అర్చకుని పత్ని మనస్సు కరిగింది అన్నంలో విషం కలిసినదని ఆచార్యుల కతి రహస్యంగ నివేదించింది ఇంకొకసారి ప్రధానార్చకుడు శ్రీరంగనాథస్వామి పాదోదకంలో విషం కలిపించి రామానుజుల కందించాడు అనాటితో తన శని పీడ విరగడయి పోగలదని ఎంతయినా ఆనందించాడు కాని ఆయన ఆ విషం అరగించి అరిగించుకొన్నారు తరవాత ఆ వృత్తాంతం తెలిసినా, ఏమాత్రము ఆగ్రహించలేదు పైగా అతనిని ప్రగాఢ వాత్సల్యంతో ఆదరించారు!'

# విశాలనేత్రాలు

యజ్ఞమూర్తి కా పురాతన గాథ లేవి తెలియవు ఉసూరుమని నిశ్వసించాడు :

'అయ్యో ! ఆచార్యులు సాక్షాత్తు సౌజన్య మూర్తులు కదా ! అటువంటివారినే చంపించివెయ్యాలని అతని కెందుకు కంతటి దుర్బుద్ధి పుట్టింది!'

'యజ్ఞమూర్తీ ! దీనికి మనమేమి ఆశ్చర్యపడ నక్కరలేదు లోకం తీరే అంత ! అటువంటి మహనీయ కారుణ్యమూర్తి హేమసుందరి రంగనాయకులు కిద్దరికి అష్టాక్షరీ మంత్రం ప్రసాదించారని విన్నప్పుడు నాకేమీ ఆశ్చర్యం కలగలేదు లోకదృష్టిలో వా రిద్దరు సచ్చరిత్రులు కాకపోవచ్చును కాని చాలా సరళ స్వభావులు వారి తీవ్ర పరస్పరానురాగమే చిట్టచివరి కీ విధంగా పరిణమించి ఫలించింది అదీగాక ఈ మధ్యన దీనిని గురించి ఆలోచిస్తూంటే నాకింకొక విషయం స్ఫురించింది పతితులన్న వారి యెడల మన కందరికి బాగా కనువిప్పు కలిగించడానికని, శ్రీరంగ నాథుని దివ్యనేత్రాల వెన్నెల వెలుగులే హేమసుందరీ రంగనాయకుల రూపంలో అవతరించిన వన్న దృఢనిశ్చయం కలిగింది విశిష్టాద్వైత వేదాంత విజ్ఞానఖనివి నీ కింతకన్న నే నేమని వివరించగలను !'

**యుద్ధ పరికరాలంటే ఏమిటి? అని అడిగితే ప్రపంచంలోని ఒక గొప్ప దేశపు పెద్ద నాయకుడు యిలా అన్నాడు "ఏదైనా యుద్ధ వస్తువే, ఆఖరికి పెన్సిలు కూడా యుద్ధానికి మ్యాపులు గీయడానికి పనికివస్తుంది"**

సుబ్బారావు (చంద్రాపురం)

యజ్ఞమూర్తి అది విని ఉసూరుమని నిశ్వసించి శిరస్సాకించుక వంచుకొన్నాడు గోవిందయతి అతని లోలోపలి పశ్చాత్తాప వైఖరి గమనించి లలిత నగవుతో తిరిగి ప్రస్తావించాడు :

'నాయనా ! ఆచార్యులు మనతో ఎంతో కలిసి కట్టుగా మాట్లాడుతూంటారు ఒక్కొక్కప్పుడు పరిహాస ప్రసంగా లారంభిస్తూ ఉంటారు తాము చాలా సామాన్యపురుషుల లన్నట్టు స్ఫురింపజేస్తూంటారు కాని జాలితో ప్రేమతో తొణికిసలాడుతున్న ఆయన నిండు గుండె లోతులు మాత్రం మన కేమాత్రము తెలియవు ! రంగనాయకునికి శ్రీరంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదని ఆచార్యులే అన్నారుకదా ! మరి తిరిగి ఇంతలోనే వా రిద్దరికి మంత్రోపదేశం ప్రసాదించవలసినంత ఆవశ్యకత ఏమి ఉన్నది ! దీని అంతరార్థమేమో గ్రహించుకొన్నావా ?'

యజ్ఞమూర్తి మరి కొన్ని క్షణాలవరకు మాట్లాడలేదు చిట్టచివరి కొక నిట్టూర్పు విడిచి పెట్టాడు

'మొదటినించి నా కిదంతా అయోమయంగానే ఉన్నది! ఇక నావంటి అజ్ఞానీ లోకంలో లేడని అనిపిస్తున్నది !'

'ఆచార్యులు మున్ముందుగా రంగనాయకుని అర్హత కనుగొన్నారు హేమసుందరి ఆ పైన అతని ధోరణి కనిపెట్టి తిరిగి నిచుళాపురం వెళ్ళిపోగలదేమో అనుకొన్నారు కాని అతని యెడల ఆమె ప్రగాఢానురక్తి గమనించిన పిమ్మట ఆయన కామె యెడల కూడా ఎంతో వాత్సల్యం కలిగింది కనకనే మొట్టమొదట ఆమెకే అష్టాక్షరీ మంత్రం ప్రసాదించారు అనంతరమే రంగనాయకుని కది ఉపదేశించారు '

'ఆచార్యు లావిధంగా స్వయంగా వా రిద్దరికి ఉపదేశించగలరని నేను కలలో కూడా ఊహించి ఉండలేదు '

'నేను మాత్రం అనుకొన్నానా ! నిజానికి ఆయన కారుణ్యదృష్టి ఎటువంటిదో మన కెవ్వరికి తెలియనే తెలియదు అంతేకాదు ! ఎంతో సన్నిహితంగా, ఆప్యాయంగా ప్రసంగిస్తున్నా, ఆయన యథార్థ స్వరూపమేమో మన కెవ్వరికి అవగాహన కాలేదు! ఈమధ్యన నా సమక్షంలోనే ఒక అద్భుతం జరిగింది '

'ఏమది?'

యజ్ఞమూర్తి ఎంతో ఆత్రతతో గోవిందయతి ముఖవైఖరి పరిశీలించాడు

'అదే చెబుతున్నాను నేను మౌన నిష్ఠ అవలంబించిన పిమ్మట ఆచార్యులు నా కెదురుగా కూర్చుని మా చిన్ననాటి ఆటపాటల మాటలతో మాటిమాటికి కవ్వించి నవ్వించవలెనని ప్రయత్నించారు నే నెంతో ఆశ్చర్యపడ్డాను అయినా నా మౌన వ్రతం విడిచిపెట్టలేదు అది గమనించి ఆయన కలకల నవ్వి 'గోవిందా ! శ్రీరంగేశులే స్వయంగా పని కట్టుకుని వచ్చి సమక్షంలో నిలిచినా, మరి నీ మౌన దీక్ష విడిచిపెట్టవు కాబోలు !' అని చలోక్తు లారంభించారు అప్పటికి నా కాయన మాటలలో అంతరార్థం సంపూర్ణంగా బోధపడింది వెనువెంటనే నా నిష్ఠ విసర్జించాను '

యజ్ఞమూర్తి రవంతసేపు నిర్ఘాంతపడ్డాడు :

'మీకేమి బోధపడినదో గాని నా కాయన పరిహాస పరమార్థమేమి అవగాహన కాలేదు '

'నాయనా ! దీనిలో అంత దుర్గ్రాహ్యమయిన పరమరహస్య మేమీ లేదు విశిష్టాద్వైత ప్రస్థాన పారం గ్రహించినవారి కాయన మాటలలో అవగాహన కాని దేదీ కనబడదు. శ్రీరంగనాథస్వామి ప్రత్యేకించి వైకుంఠంలోనే కాక, వేర్వేరు అంశలతో ప్రాణులలో, మానవులలో, ప్రపంచంలో సర్వత్ర నివసిస్తున్నారు మరి మాయ అన్నది

ఎక్కడ లేవేలేదు 'ఇదేకదా విశిష్టాద్వైత పరమార్థము !

'అటువంటప్పుడు తోటివారియెడల మానదృష్టి ఎవ్వనికి మాత్రం సహస్యంచదా ? ఇదీ వారి పరిహాసంలో గల పరమార్థం ! కనకనే కేవలం పతితులని మనవంటివారందరు ఈసడించుకొంటున్న వారియెడల ఆయన అపార కరుణాదృష్టి ప్రసరిస్తున్నది! కాని మనకది ఎంతో విడ్డూరంగా కనిపిస్తున్నది !'

ఆ ప్రసంగంతో యజ్ఞమూర్తి లోలోపలి మథన యావత్తు మంచువిడిపోయినట్లు పోయింది :

'మీరన్నది ప్రత్యక్షరము యథార్థమే ! ఎంతగా ఎన్నెన్ని గ్రంథాలు మథించినా ఈమాత్రం సామాన్య విషయంకూడా నా కవగతం కాలేదు ! ఇంత కాలం నించి ఎడతెగని జ్ఞానాంధకారంలోపడి కొట్టుమిట్టాడుతున్నాను'

అతడంతలోనే లేచి నిలబడి రంగనాయకుని భవంతికి ప్రయాణమయినాడు గోవిందయతి తన మాలతోబాటు నాలుగయిదు అడుగులవరకు అతనివనుసరించి తిరిగి చల్లని పలుకులతో హితవుపదేశించాడు

'నాయనా! పామరుల కెవ్వరికి పరమేశ్వర సాక్షాత్కారం లభించదని మనవంటి వారందరు అహంకరిస్తూ ఉంటారు ! కాని విద్వాంసులకన్న వారే ఆయనకెక్కువ సన్నిహితులని నా నమ్మిక ! కనకనే ఆచార్యులతనికి పీఠాధిపత్యం ప్రసాదించవలెనని సంకల్పించి ఉంటారు! మరి ఈ విషయమై నీవేమాత్రము మథనపడనక్కరలేదు !"

"ఔను ! మీరన్నది నిజమే ! నా కిప్పటికి కనువిప్పు కలిగింది ! మరి సెలవు ! అతని దగ్గిరకిప్పుడే బయలుదేరుతున్నాను'

అత్యంత వినీత వైఖరితో వీడ్కొన్నాడు యజ్ఞమూర్తి మఠాధిపతి రంగనాయకుని భవంతి గుమ్మంలో అడుగు పెట్టేసరికి ఎక్కడికో బయలుదేరిన అత డెదురుపడ్డాడు యజ్ఞమూర్తి రాక గమనించి రంగనాయకుడు కొంతసేపాశ్చర్యపడ్డాడు సగౌరవంగా ఎదురుగాపోయి వీధి అరుగుమీద వేసిన వ్యాఘ్ర చర్మంమీద కూర్చోబెట్టి ఎంతో వినయంతో సరసనే సమాసీనుడయినాడు యజ్ఞమూర్తి మొట్టమొదట కుశలప్రశ్నతో ప్రసంగం ప్రారంభించి ఆచార్యుని ముఖతః ఉపదేశం స్వీకరించిన అదృష్టశాలివని అభినందించాడు అయినా రంగనాయకుడు ఉబ్బి తబ్బిబ్బైపోలేదు

'అదంతా వారి అనుగ్రహమే! లేకపోతే నావంటి అజ్ఞానికి అంతటి అర్హత ఎక్కడిది ?'

'ఒప్పే! దీనిలో తమ అనుగ్రహం లేశమాత్రమయినా లేదని ఆచార్యులే ఆనాడు నాతో అన్నారు'

ఆ తరవాత యజ్ఞమూర్తి దేవాలయంలో కల్యాణ మంటపంలో తనకు, ఆచార్యునికి మధ్య నడిచిన ప్రసంగం సంగ్రహంగా అతనికి తెలియజేశాడు రంగనాయకుడది విని మరింతగ ఆశ్చర్యపడ్డాడు మరికొన్ని క్షణాలవరకు అతని నోట మాటే వెలువడలేదు అంతలోనే యజ్ఞమూర్తి తాను వచ్చిన పని తెలియజేసి సగౌరవ దృష్టితో అతని నభినందించాడు 'మేలుకొన్నానా ? కలగన్నానా ?' అని రంగనాయకుడు క్షణకాలం విస్మితు డయినాడు యజ్ఞమూర్తి మాటమీద అతని కేమాత్రము నమ్మిక కలగలేదు మఠాధిపతి తిరిగి అది యథార్థమే అని తిరిగి రెట్టించిన తరవాత అతని కిక విశ్వసించక తప్పలేదు:

'ఆచార్యుల కొకవేళ నామీద దయ తప్పినదేమో! లేకపోతే నే నెక్కడ! మీవంటి మహనీయ విద్వాంసులు స్వీకరించదగిన శ్రీవైష్ణవ పీఠాధిపత్యమెక్కడ ! మన్నించండి ! ఇది నావల్ల అయ్యే పని గాదు'

'ఇది శ్రీమద్రామానుజుల ఆనతి ఆయనే స్వయంగా నన్నిక్కడికి పంపించారు'

రంగనాయకుడు సవినయంగా శిరస్సాకించుక వంచుకొని దోసిలికట్టి విన్నవించాడు

నేను దీని కేమాత్రము తగనన్నానని వారికి విన్నవించండి !'

'అర్హతానర్హతలు నిర్ణయించవలసినవారు

---

వాది : అయ్యా! నా తరపున సాక్షు లొక్కరూ రాలేదు. కేసు వాయిదా కోరుతున్నాను

మేజిస్ట్రేటు : ఏమయ్యా! ప్లీడరూ! ఎవ్వరూ రాలేదా?

ప్లీడరు : లేదు సార్! ఒక్క గ్రామ మునసబు మాత్రం రాలేదు.

మేజిస్ట్రేటు : సరే! ఎప్పటికి వేయను వాయిదా ?

సం॥ కొటియ్యనాయుడు (వేల్ బోర్డు)

---

ఆచార్యులు కాని, మనం కాము వారే స్వయంగా స్వీకరించవలసినదని ఆదేశించినప్పుడు కాదని తిరస్కరించడం భావ్యంకాదు'

అయినా రంగనాయకుడు తన పట్టు విడిచిపెట్టలేదు తాను కేవలం అనర్హుడనని మాటిమాటికి విన్నవించుకొన్నాడు యజ్ఞమూర్తి కిక ఏమనడానికి పాలుపోలేదు కొంచెంసే పాలోచించాడు

'స్వయంగా వచ్చి నీవే వారికి సంగతి నివేదించడం మంచిది'

'ఔను ! ఇది మంచి ఆలోచనే ! అయితే మీరు కూడా కొంచెం వెంట వచ్చి సాయపడాలి !'

యజ్ఞమూర్తి దాని కంగీకరించిన తరవాత వా రిద్దరు మఠానికి బయలుదేరారు మరికొంతసేపటికి రామానుజయతిని సందర్శించారు రంగనాయకుడు ఆచార్యుని సముఖంలో అడుగు పెట్టినంతలోనే పాదాలపై సాగిలపడి నమస్కరించి విన్నవించాడు

'తమ ఆజ్ఞ యజ్ఞమూర్తిగారు నా కింతకు మునుపే వెల్లడించారు అయితే నే నెక్కడ ? ఆ పీఠాధిపత్య మెక్కడ ! మీ ఆజ్ఞ తిరస్కరించినందుకు మన్నించవలసినదని ప్రార్థియపడుతున్నాను'

రామానుజ డతనిని ఎంతో ఆప్యాయతతో లేవనెత్తి తిరిగి ప్రగాఢాత్మీయ దృష్టితో ప్రోత్సహించాడు

'నాయనా ! దీనికి నీవు అన్నివిధాల అర్హుడవే! సందేహంలేదు కాని ఎందుచేతనో సంకోచిస్తున్నావు !'

అయినా రంగనాయకుడు తన పట్టుదల విడిచిపెట్టలేదు మన్నించవలసిందని మాటిమాటికి ప్రార్థియపడ్డాడు ఆపైన ఆచార్యుని ముఖంలో మరికొన్ని క్షణాలవరకు గభీర మౌనముద్రమాత్రమే స్థిరపడింది మరికొంతసేపటి కాయన యజ్ఞమూర్తివైపు చూచి రవంతసేపాలోచించాడు

'చూడు నాయనా ! యజ్ఞమూర్తి కిటీవల వల్లమాలినంత పని పెరుకొన్నది పోనీ నీవు మన మఠంలో కోశాధికారిగా వ్యవహరించి ఆ బరువు కొంచెం తగ్గించకూడదా ?'

రంగనాయకుని కా సూచన తిరస్కరించడం భావ్యంకాదని అనిపించింది కొంచెం సంకోచిస్తూ నీళ్లు నమిలాడు

'మఠాధిపతులు అడుగడుగునా సాయపడితే నాకిది అంతగా కష్టమైన పనికాదు తప్పక తమ ఆజ్ఞ శిరసావహించగలను'

యజ్ఞమూర్తి ఆ నియమాని కంగీకరించాడు రంగనాయకుడు వా రిద్దరికి అతి వినీత వైఖరితో నమస్కరించి సెలవు తీసుకుని తిరిగి తన భవంతికి బయలుదేరాడు ఇటీవల ఆచార్యునికి తన యెడల ఇనుమడించిన వాత్సల్య దృష్టి తలుచుకోగానే, అతని నేత్రాంతాలలో కన్నీటిబిందువు లేకధారగా ప్రవహించాయి తన తపన బలిమి వల్లనే శ్రీరంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదని ఆచార్యు లన్నమాట సంస్మరించినప్పుడు అతని కెంతో ఆశ్చర్యం కలిగింది నిజంగా నాలో అంతటి తపన ఏమి ఉన్నది? వారి అనుగ్రహమే నా కటువంటి మహనీయ భాగ్యం ప్రసాదించింది! లేకపోతే నే నెక్కడ ? స్వామి సాక్షాత్కార మెక్కడ ? అయితే ఆచార్యుల నోట ఎన్నడు అసత్యం వెలువడదే ! మరి ఆయన ఎందుకలాగ సెలవిచ్చారో ! లేకపోతే అందరియెదుట తామే అంతటి మహత్కార్యం నెరవేర్చినట్లు ప్రకటించరా ? అయితే మాటవరసకయినా ఆయన అసత్యం చెప్పరే ! తమ ఘనత వెల్లడించడాని కిష్టంలేనప్పుడు అలవాటయిన గభీరముద్ర స్వీకరించవచ్చునే! అదంతా నా తపన ఫలితమే అని ఎందుకన్నారో! ఎన్నెన్ని విధాల ఆలోచించినా అతనికా జటిల ప్రశ్న కెంతసేపటికి తగిన సమాధానం స్ఫురించలేదు చిట్టచివరికి 'దీనికింత ఆలోచన ఎందుకు? ఆచార్యు లపార కరుణా సముద్రులు !' అని నిశ్చయించుకొన్నాడు

రామానుజుని వెడద కనుదోయిలో తొణికిసలాడుతున్న కారుణ్యచ్ఛాయ సంస్మరించగానే అతని కన్నెదుట శ్రీరంగేశుని విశాల విలోచన యుగళి నిశ్చలమయిన మైడి మెరుపుల జంటవలె తళుక్కుమని ప్రకాశించింది. చిన్ననాటినుండి అతడు

ఇంటిల్లిపాదికీ ఆనందం కలిగించే
ఆంధ్రసచిత్ర వారపత్రికను తప్పక చదవండి.

# విశాల నేత్రాలు

విమళాపుర గ్రామ వృద్ధుల నోట శ్రీరంగశాయి కేవలం కరుణాస్వరూపులన్న అభివర్ణన ఆకర్షిం చాడు కాని అప్పుడది అతని కేవామాత్రము అవ గాహన కాలేదు. ఇటీవల రామానుజుల అపార కృప తలుచుకొన్నప్పుడు రంగనాయకునికి ఆ సూక్తిలో గల అంతరార్థం రవంత బోధపడింది 'శక్తి సామ ర్థ్యలలో, కరుణలో, ప్రాభవంలో స్వామి ఆచా ర్యులకన్న కొంచెం గొప్పవారయి ఉండవచ్చును లోకాలే సృష్టించగలిగిన శ్రీరంగనాథుని కృప నావంటి పాపి కెలగ బోధపడుతుంది!' లోలోపల కొంచెం సమాధానపడ్డాడు రంగనాయకుడు. వజ్జులే కాక, తనవంటి అధమాధములు కూడా అనేక మార్గాలలో ఎడతెగని దుఃఖాలనుభవించి చిట్ట చివరి కాయన చల్లని అడుగుల నీడలలో మేను వాల్చి, విశ్రమించి ఆనందిస్తున్నారని నిశ్చయించుకొన్నాడు తనవంటి మహాపాతకిమీదే స్వామి కంతటి దయ కలిగినప్పుడు మిగిలినవారి యెడల ఆయన కెంత యినా జాలి కలిగితీరుతుంది వా రందరిని వేర్వేరు దారులలో క్రమక్రమంగా తనవైపే ఆకర్షించు కొంటున్నారు మరి సందేహంలేదు! ఎంతో సంతృప్తిపడ్డాడు రంగనాయకుడు అతనికా క్షణంలో శ్రీరంగనాథుని సువిశాల నేత్రాలే కాక, సమగ్ర స్వరూపం సమస్తము హృదయ నయనాల సమ క్షంలో సాక్షాత్కరించింది చెక్కిళ్లపై ఆనంద బాష్పాలవిరళధారలై ప్రవహించాయి! లోకంలో స్వార్థశూన్యమయిన జాలి, కరుణ, ఔదార్యము, ప్రేమ, ఆత్మీయత తొణికిసలాడిన హృదయాలే శ్రీరంగశాయి దేవళాలని కూడా గ్రహించుకొన్నాడు తిరిగి అతని కటాక్షాలలోనుండి కన్నీటిబిందువులొకటి రెండు పొటమరించాయి

అదే సమయంలో అతనికి విమళాపురంలో గడిపిన జీవితమంతా ఒక వినూతనరూపంలో అతి విచిత్రంగా కనిపించింది తిరుమలరెడ్డి మాటిమాటికి కష్ట కట్టి అనేక విధాల వేధించాడు చంపించివేయించా లని కూడా శాయశక్తులా ప్రయత్నించాడు ఆ వగ భరించలేక అత డకస్మాత్తుగా శ్రీరంగం చేరు కొన్నాడు. అక్కడ రామానుజుల సందర్శన భాగ్యం లభించింది. దానికి తిరుమలరెడ్డి పరోక్షంగా ప్రధాన కారణభూతుడని గ్రహించుకొన్న పిమ్మట రంగనాయకునికి అతడొక మహోపకారిలా సాక్షాత్కరించాడు! ఇన్నాళ్లనించి అతనియెడల లోలోపల పేరుకొన్న అక్కస్సంతా ఒక్క మారుగా మంచు విడిపోయినట్టు విడిపోయింది బద్ధశత్రువులే ఒక్కొక్కప్పుడు మహోపకారులు కాగలరని అత డిరాడు అకస్మాత్తుగా గ్రహించు కొన్నాడు తన మాట చెప్పగానే ఈసడించివేసిన శృంగారమంజరి యెడల, తల్లిదండ్రుల యెడల అతని కదే విధమయిన ఆర్ద్ర దృష్టి కలి గింది. వారి కెప్పటికయినా తన యెడల అభిమానం కలుగకపోదని లోలోపల కొంచెం సంతృప్తిపడ్డాడు ఎడతెగని వారి పోరే శ్రీరంగ ప్రయాణం ప్రేరేపించినదని గ్రహించగానే అతని కెంతో ఆశ్చర్యం కలిగింది 'అన్నీ మంచికే వస్తాయి' అన్న లోకుల సూక్తిలో గల పర మార్థం అతని కిప్పుడు సమగ్ర స్వరూపంతో భాసించింది సింహాచలాన్ని తలుచుకోగానే అతని కెంతో జాలి వేసింది తిరిగి ఆ దురదృష్ట వంతుని కుటుంబాని కడుగడుగునా సాయపడా లని గట్టిగా నిశ్చయించుకొన్నాడు.

మెమ్మదిగ మెమ్మదిగా అడుగులు వేసుకొంటూ రంగనాయకుడు ఇంటిలో అడుగు పెట్టేసరికి హేమసుందరి అప్పుడే దీపం వెలిగించి అతని రాకకోసం నిమేష మొక యుగంగా నిరీక్షిస్తున్నది ప్రశాంత సౌందర్యకాంతిలో చెక్కిళ్లపై ప్రతిఫ లిస్తున్న కాంచన కర్ణాభరణాల కాంతులలో బెదిన మీనుల జంటవలె మిలమిలలాడుతున్న ఆమె సువిశాల విలోచనాలవైపు పరలోచికించగానే రామానుజ శ్రీరంగేశుల మనోజ్ఞ నయనాల జంట లొకదాని వెనుక వేరొకటి తటాలున అతని హృదయాంత రాళంలో సాక్షాత్కరించాయి! మరికొన్ని క్షణాల వరకు అతని వైఖరిలో విపరీతమయిన పర ధ్యానం గోచరించింది.

'ఇదేమి టిలాగున్నా రివేళ! మఠంలో గాని తిరిగి మళ్లీ విద్యార మేమయినా జరిగిందా ?'

రంగనాయకుని నిశ్చలదృష్టి హేమసుందరి వెడద కనుదోయి కోణులలో చిక్కుకొన్నది ఉల్లాస పారవశ్యంతో తలమునకలై రామానుజు లానాడు పీఠాధిపతిగా అభిషేకించదలిచిన విషయం వెల్ల డించాడు.

'నిజమేనా ?'

హేమసుందరి స్ఫటిక బొమ్మలా విభ్రాంతపడి నిలుచున్నది.

'నిజమే ! అయితే నేను దాని కంగీకరించలే దనుకో! కాని చిట్టచివరికి మఠంలో కొశాధి పతిగా నయినా వ్యవహరించవలసినదని ఆజ్ఞాపిం చారు. వారి మాట కాదనలేక అంగీకరించాను'

'అమ్మయ్య ! ఇంతేకదా ! అయితే ఇక మన పసి వాడికి ఆచార్యులపేరే పెట్టుకుంటాము. మఠాధిపతి మాట వినబడగానే మీ సన్యాసిని కేమయినా ప్రయత్నాలు జరుగుతున్నాయేమోనని చాలా భయ పడ్డాను.'

రంగనాయకు డా సుందరిని మృదువుగా కౌగ లించుకొని అలవోకగా విశాలనేత్రాలు ముద్దు పెట్టుకొన్నాడు :

'ఎందుకు హేమా! నీ కింతటి ఆరాటం ! ఇటీవల నాలో సన్యాసం స్వీకరించాలన్నసంకల్పం మొలకెత్తినదని గ్రహించి ఆచార్యులేమన్నారో తెలుసునా ? నాయనా! చెయ్యి పట్టుకుని హేమసుందరి నిన్ను శ్రీరంగస్వామి సన్నిధికి తీసుకువచ్చింది. అదీగాక లోకంలో అంతట నివసిస్తున్నట్టే ఆమె అంతరాంతరంలో కూడా స్వామి ఉన్నారు కదా ! ఇక ఆయన కోపమని ప్రత్యేకించి సన్యసించి నీ వెక్కడికి పోగలవు ? అంతట ఉన్నవా రాయనే కదా ? అస్సైన నీ వింకా చాలా చిన్నవాడవు! బాగా పెద్దవాడవయిన తరవాత అప్పటి మాట ఆలోచించుకోవచ్చునులే !' అన్నారు అందుచేత నే నప్పటినించి ఆ మాటే తలపెట్ట లేదు అనవసరంగా కంగారుపడి కాళ్ళు విరగ్గొట్టు కోకు!'

# విశాల నేత్రాలు

'అలాగా! అయితే స్వామి నా మీద అలిగినా అన్నమాట ఈ మొక్కుబడి చెల్లించుకోవడం ఒక్కటే తరువాయి'

రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు:

'ఏమని మొక్కుకొన్నావు!'

'నా కడుపున ఒక కాయ కాచి, పసివాడితోపాటు మీరు పది కాలాలపాటు నట్టింట పారాడుతూంటే పచ్చలహారం సమర్పిస్తానని మొక్కుకున్నాను'

'అమ్మ దొంగా! రెండు మూడు పెద్ద కోరికలతో ముడిపెట్టి ఎంత విచిత్రంగా మొక్కుకున్నావు! స్వామి నీ మాయ గ్రహిస్తే మరి కోరిక చెల్లిస్తారా?'

రంగనాయకుడు కొంచెం కొంటెతనంతో చిరునవ్వు చిందించాడు:

"ఏరి కోరి ఆచార్యులే మీవంటి గజదొంగని కోశాధికారిగా నియమించుకోలేదా ఏమిటి? మీకన్న నే నేమయినా తీసిపోయానా? అప్పుడే నా కోరిక కొంత నెరవేరినట్టే! స్వామి దయతలిస్తే మిగిలినది కూడా నెరవేరకేం చేస్తుంది!'

'అబ్బో! నువ్వు నాకన్న రెండాకు లెక్కువ చదువుకొన్న గొప్ప గజదొంగవి! నిండు గుండె నిలువునా దోచుకున్నావు'

వ్యంగ్యంగా ఒక ఛలోక్తి విసిరాడు రంగనాయకుడు కలకల నవ్వి. హేమసుందరి మరి ప్రతిసమాధానం చెప్పలేక ఒకించుక తల వంచుకొన్నది ఆ కొత్త మొక్కుబడితో స్ఫురించిన హేమ ప్రేముడి లోతు గ్రహించినంతలోనే అతని కామె పాదాలమీద వాలి ముద్దులతో ముంచెత్తాలన్న తహతహ కలిగింది క్షణంలో ఆ సంకల్పం గ్రహించుకొన్న హేమసుందరి అంతలోనే కొంచెం దూరంగా తొలగి నిలుచున్నది:

'చాలు! చాల్లెండి! మీ వెర్రి చేష్టలు! సంధ్య వైష్ణవానికి నంగనామా లెక్కువన్నట్టుంది మీ ధోరణి!'

ఆనాటినించి హేమసుందరీ రంగనాయకుల జీవితయుగళి అనుక్షణము రామానుజయతి మఠ పరిచర్యలకే అంకితమయింది అంతేకాదు స్వామి ఉత్సవాలలో, ఊరేగింపులలో హేమ గరిడీల వినోదాలమీద రంగనాయకుని శ్రద్ధ నానాటికి అతిశయించింది ఎప్పుడయినా వారాని కొకమారు వీధి మొగలో నిలబడి వినోదా లారంభించగానే పైడి వెండి చక్రాలు కోకొల్లలుగా అతని పాదాల దగ్గర వర్షించాయి! అందువల్ల అతని మనుగడ వివిధమయిన కొదవ లేకుండా హాయిగా గడిచిపోయింది రంగనాయకుడు తన సంపాదనలో చాలా భాగం మఠాని కర్పించాడు అలాగే ప్రత్యేకించి కొంత సొమ్ము సింహాచలం కుటుంబానికి అందేటట్టు గట్టి ఏర్పాటు చేశాడు

ఆచార్యుని మంత్రోపదేశం విన్న పిమ్మట ధర్మకర్త ఎంతో ఆశ్చర్యపడి అతని భృతి ఇనుమడించవలెనని నిశ్చయించాడు కాని రంగనాయకుడు దాని కంగీకరించలేదు వివిధమయిన జీతము, భత్యము లేకుండా సదా స్వామి సేవ కనుమతించవలసినదని వేడుకొన్నాడు నిమేషకాలం నిర్ఘాంతపడిన పిమ్మట ధర్మకర్త అతని ప్రార్థన కంగీకరించి అనేక విధాల అభినందించాడు

రంగనాయకునికి రామానుజులు స్వయంగా తామే అష్టాక్షరి అనుగ్రహించారన్న వార్త చెవిని పడిన పిమ్మట పౌరప్రముఖుల కందరికీ అతని మీద విపరీతమయిన గౌరవం కలిగింది. క్రమక్రమంగా నా నందరు మఠానికి వచ్చి దేవరాజస్వామిని సందర్శించి నిరివిగా కానుక లర్పించడం ప్రారంభించారు ఆ వార్త విన్న తరువాత మఠం విడిచిపెట్టి వెళ్లిపోయిన బ్రహ్మచారు లొకరొకరే తిరిగి వచ్చి తమ తప్పిదాలు మన్నించవలసినదని యజ్ఞమూర్తి నర్థించారు అతని అనుమతితో తిరిగి మఠంలో ప్రవేశించారు క్రమక్రమంగా శ్రీరంగేశుని యెడల హేమసుందరీ రంగనాయకుల కేర్పడిన అపూర్వ ప్రగాఢ భక్తి గోవిందయతి వంటి పరమబ్రహ్మణ్యులకే ఎన్నికచేసి మన్నించదగిన గొప్ప ఒరవడిగా గోచరించింది! వారి అన్యోన్యత, సౌజన్యము, సరళ వర్తనము క్రమక్రమంగా మఠవాస్తవ్యులకే ఎంతో ఆశ్చర్యం కలిగించాయి!

శ్రీమద్రామానుజుని విశిష్టాద్వైత ప్రస్థాన ప్రభావంవల్ల దక్షిణ భారతంలో పల్లెపట్టులలో, పట్టణాలలో అంతట అసంఖ్యాక సముత్తుంగ దేవాలయా లావిర్భవించాయని చరిత్రవేత్తలందరు ఏకగ్రీవంగా నిర్ణయిస్తున్నారు అవి పరమేశ్వరునికోసం భక్తిపరవశమయిన జనానీకం పైకెత్తిన సుదీర్ఘ నిశ్చల హస్తాలవలె తరలిస్తున్నాయని వేనోళ్ల అభివర్ణిస్తున్నారు అయితే అపార కృపానిధి రామానుజయతి మంటిపుట్టువు లయిన హేమసుందరీ రంగనాయకుల వంటి వారి నెందరినో మహనీయ మానవ స్వర్ణ దేవాలయాలుగా మలిచిన విషయం గుర్తించిన చరిత్రకారు లెంతోమంది లేరు! —అయిపోయింది.



# మనమూ-మన దేహస్థితి

23-వ పేజీ తరువాయి

ప్రదేశం (Mental Plane) గా భావించారు. మనఃస్థితినిబట్టి ఈ ప్రదేశంలో ఉండే అంగములు మారుతూ ఉంటవి అసహ్యంగా ఉండే పదార్థములను చూచినప్పుడు కడుపులో దేవినట్లయి వాంతి రావడం అందరికీ తెలిసిన విషయమే

జఠరాశయ వ్రణములు స్త్రీ పురుషులలో సమానంగానే కనుపిస్తవి కాని డువోడిన వ్రణము స్త్రీలలో కంటె పురుషులలో నాలుగు రెట్లు అధికంగా సంభవిస్తుందని తేలింది మంచి ఆహారం లభించని బీద రోగులలో జఠరాశయం వ్రణముల వల్ల మరణ భీతి, రక్తవాంతి భీతి అధికంగా ఉంటుంది అంటే అవి శీఘ్రంగా మానక, అంతకంతకు లోతై, ప్రమాదాన్ని కలిగిస్తవి అన్నమాట నాగరికత పెరిగినకొద్దీ జఠరాశయ వ్రణముల కంటె, డువోడిన వ్రణముల సంఖ్య పెరిగి పోతున్నది. ఆ విషయం చికిత్సను చర్చిస్తున్నప్పుడు మళ్లీ వివరిస్తాను

జఠరాశయంలో ఏర్పడిన దీర్ఘ వ్రణము చాలా చిన్నదిగానూ ఉండవచ్చును; చాలా పెద్దదిగానూ ఉండవచ్చును జఠరాశయం గోడలో, లోపలినుంచి పైకి, (1) మ్యూకస్‌పొర (2) కండరములపొర, (3) సీరస్‌పొర అని మూడు పొరలున్నవని యిది వరకే తెలుసుకున్నాము ఉదరం (Abdomen) లోపలిభాగమును పెరిటోనియం అనే ఒక రమయిన పొర కమ్మి ఉంటుంది ఆ పొర మడతలు మడతలుగా ఉదరంలో ఉండే అంగములను చుట్టి ఉంటుంది అలాగే జఠరాశయమునూ కొంతవరకు చుట్టి ఉంటుంది జఠరాశయంలో పుండు చుట్టూ ఉండే ప్రదేశం గడ్డబాగా గట్టిగా ఉంటుంది దాని అంచులలో తరచు ఇన్‌ఫ్లమేషనూ, నీరూ చేరడం (Oedema) ఏర్పడతవి క్రమంగా అల్సరు జఠరాశయం గోడను కొరుక్కుంటూ లోపలికి పోతుంది చివరకు దానిలో కన్నం ఏర్పడి, జఠరాశయంలో ఉండే వస్తువులు పెరిటోనియం మడతలలోకి పోయినా పోవచ్చును ఈ స్థితి, అత్యంత ప్రమాదకరమైనటువంటిది అప్పుడు పొట్టగోడ బల్లలాగా అయిపోతుంది విపరీతమైన బాధ ఏర్పడుతుంది శరీరం చల్లబడి చెమటలు కారిపోయి నాడి మందగించుతుంది కాని సాధారణంగా వ్రణం లోతయినకొద్దీ దాని సమీపంలో ఉన్న పెరిటోనియ భాగం, జఠరాశయం గోడకు అతుక్కుపోయి, కన్నం ఏర్పడి, ప్రాణాపాయం రాకుండా కాపాడడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది దీనిని చొచ్చుకుని, వ్రణము, పరిసరములలో ఉండే, లివరు, పేంక్రియస్ వంటి అంగములలోకి పోవచ్చును లేక జఠరాశయంలోనే కన్నంవేయవచ్చును ఇటువంటి అల్సరు జఠరాశయంలో పైలోరస్ భాగంలో ఏక సంఖ్యలో తరుచు ఏర్పడుతూ ఉంటవి ఇతర ప్రదేశములో ఏకకాలంలో రెండుమూడు చిన్న అల్సర్లు ఉండవచ్చును ఈ వ్రణము చొచ్చుకుపోతున్నకొద్దీ, జఠరాశయములో ఉన్న యితర అంగములకూ జఠరాశయానికీ మధ్య తోళ్లవంటి నూతన నిర్మితులు ఏర్పడవచ్చును వీటిని "ఎడ్హిషన్సు" (Adhesions) అంటారు ఇలా కొరుక్కుపోయే వ్రణాలే రక్తనాళములనూ తిని, రక్తస్రావం కలిగించి, అతిశీఘ్రంగా ప్రాణాపాయం ఏర్పడవచ్చును ఇంతగా పెరిగిన అల్సరుకూ, జఠరాశయంలో ఏర్పడే కేన్సరుకూ భేదం కనిపెట్టడం కష్టం. అటువంటి అల్సరు మానినా కూడా జఠరాశయం రూపమే మారిపోతుంది

కాని, ఈ విపరీత పరిస్థితులు చాలా తక్కువగా ఏర్పడతవి సాధారణంగా ఒకటి రెండు చిన్న అల్సర్లు మాత్రమే జఠరాశయంలో ఏర్పడి, బాధ కలిగిస్తూ ఉంటవి.



తిరిగింది పెదిమల కొనలు కంపించినై మెల్లిగా. చేయి చాచింది మాలతి తల్లిచేతిలో తన చేయి ఉంచింది నోటిలో గుడ్డ క్రుక్కుకుని అతిప్రయత్నంతో దుఃఖాన్ని ఆపుకుంటోంది పావిత్రమ్మ ఇదేమి గమనించలేదు. కొంచెం పట్టుకున్న నిర్మల చేతిని తన చేతిలోకి తీసుకుంది— ఆయాసంతో ఆగి, ఆగి అంటోంది 'నిర్—మలా— మా—ల—తి—ని— నీ చేతిలో— పెడు—తున్నా"

నిర్మల పెదాలు గట్టిగా నొక్కి పట్టుకుంది— ఆమె పండ్లు పెదాలలోకి దిగబడిపోయినట్లనిపించింది.

"ఆ విషయంలో మీరు విశ్రాంతిగా ఉండండత్తమ్మా— మాలతిని నా ప్రాణప్రదంగా చూసుకుంటాము" అంది కష్టంతో.

ఆమె వినినట్లులేదు ఆమె చూపు ఛర్తపై నిలిచిపోయింది. డాక్టర్ కొంత పరీక్షించింది. మెల్లిగా బ్యాగ్ మూసేసి లేచి వెళ్ళిపోయింది. ఆమె చెంపలమీదుగా కారిపోతున్న కన్నీరు చూచి దూరంగా తొలగి నుంచున్న రాజారావుగారు ఉత్తరీయంతో ముఖం కప్పుకున్నారు. నిర్మల, మాలతి దుఃఖానికంతులేదు. ఆ గృహంలో శోకదేవత తాండవమాడుతోంది. రుక్మిణమ్మభర్త, రాజారావుగారి చెల్లి భర్త వచ్చారు—దూరపు బంధువులు కొందరు వచ్చారు. ప్రసాదరావుగారు, రాము వచ్చారు అప్పుడే రాము పరీక్షఫలితాలు తెలిసినై బి ఏ యస్‌సి ఫస్టు క్లాసులో పాసయ్యాడు రాజారావుగారి ఆనందం వర్ణనాతీతం కానీ, అనుసహచరిణిని గూర్చిన చింత అతన్ని బంధించింది

అందరూ వెళ్ళిపోయారు రాము మాత్రం ఉండిపోయాడు పక్షంరోజులు గడిచినై ఉద్యోగానికి దరఖాస్తు వ్రాస్తున్నాడు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, కమిలిపోతూ, ఒంటరిగా కూచుని దుఃఖిస్తూ ఉండే రాజారావుగారు రాముని చూచారు రాము తాను దరఖాస్తుపెడుతున్నట్లు చెప్పాడు రాజారావుగారు కొన్ని క్షణాలు తీక్షణంగా ఆలోచించారు రాముప్రక్కన కూచుని, రాము భుజంమీద చేయివేసి అన్నారు "క్లాస్ వచ్చింది కదా ? ఎం. ఏ. యస్ సి యెందుకు చేయకూడదు ? నీకు సీట్ తెప్పించే భారం నాది—"

రాము కృతజ్ఞతతో చూచాడు మెల్లిగా తల వంచుకునే అన్నాడు "మీకు తెలియని విషయాలేమున్నాయి చెప్పండి ? ఇప్పటికే నాన్నకు ఆర్థికంగా యెంతో కష్టంగాఉంది తమ్ముడు మధు సంగతి మీకు తెలియదనుకుంటాము వేయిరూపాయల దాకా అప్పుచేసి ఎటో వెళ్ళిపోయాడు వాడి జీవితం యింత దారుణంగా పరిణామం చెందుతుందని కలలోనైనా తలంచలేదు నాన్న తన గౌరవం కాపాడుకోవాలని ఆ డబ్బంతా యెలాగో తీర్చారు ఇలాంటి పరిస్థితుల్లో నేను సంపాదించి వారికి సాయపడగల్గితే నా చదువు సార్థకమవుతుంది కదండి మామయ్యా? మీరు అన్నారు —అంతేచాలు— కానీ, నాన్నకింకా ఆర్థిక వత్తిడి కల్గించలేను"

రాజారావుగారు మాట్లాడలేదు ఎన్నో నిముషాలు గడిచినై గుమస్తాలు వచ్చారు వాళ్ళను చూచి లేచి వెళ్తూ అన్నారు "నీ యిష్టం—కానీ, రామూ

# బంగారు పంజరం

12 వ పేజీ తిరువాయి

యెప్పటికైన నీకు చదవాలని కోరిక కల్గితే నన్ను మర్చిపోకు పిలాటివారు, బాగా పైకి చదివి వృద్ధిలోకి రావలసినవారు, యిలాంటి పరిస్థితులకు తలొగ్గి తమ భవిష్యత్తును ఉన్నతస్థాయి పందుకోవివ్వరు. అది నీ తప్పుకాదులే బాబూ— కాల ప్రభావం అలాంటిది మరి"

నిర్మల పిల్లల్ని బడికి పంపి దినపత్రిక చదువుతూ కూచుంది రాము వచ్చి దగ్గర్లో కూచుని రాజారావుగారికి, తనకు జరిగిన సంభాషణను వివరించాడు నిర్మలకు యేదో స్ఫురించింది. తమ్ముడివైపు నిశ్చలదృష్టితో చూస్తూ అంది :

"నీకు చెప్పవలసిన సమయంవచ్చింది— విషయం తెలుసుకొన్నతర్వాత నీ చదువువిషయం ఒక తీర్మా

"నువ్వు పిచ్చివాడివి" ఒకడు రెండోవాణ్ణి నిలదీసి అన్నాడు.
"నువ్వే పిచ్చివాడివి" అన్నాడు రెండోవాడు.
"కాదు"
"ఔను"
"కాదు"
"సరే ! ఇదుగో నీవు పిచ్చివాడివి కావని ఋజూ చేసుకో."
మొదటివాడు తన జేబులో నించి సర్టిఫికేటు తీశాడు-వాణ్ణి పిచ్చాసుపత్రిలోనించి వదిలినట్లు.

రారాజు (నగరి)

నం చేసుకో. నీకు అనుభవంఉందికదా ... నిన్ను చదివించింది నాన్నకాదు మామయ్యగారే!—నీ జీవితకాలమంతా వారికి కృతజ్ఞుడవై యుండాలి రామూ వారికి నీపై అపారమైన ప్రేమ ఇప్పుడే వెళ్ళి వారికి నీ కృతజ్ఞత తెలియపర్చు—"

నిర్మల చెబుతున్న మాటలను నమ్మలేక నమ్ముతున్నాడు విస్తుపోయి చూస్తుండిపోయాడు నిర్మల "వెళ్ళు రామూ" అంది అతని మనసు వర్తమానకాలంలోకొచ్చింది ఆవేశంతో అన్నాడు

"అక్కయ్యా— యిది నిజమా ? నా కెందుకు చెప్పలేదు ?"

"దానికీ కరణం లేకపోలేదు నాన్న నాకోసం చెమటోడ్చి డబ్బు పంపుతున్నాడన్న భావన నీలో ఉంటేనే, నీవు నీ కాలాన్ని సద్వినియోగపర్చి బుద్ధిగా చదువుకుని సన్మార్గవర్తనుడుగా ఉంటావు నేను పంపుతున్నా ననుకున్నావా ? అక్కయ్య కేం తక్కువ— ఎంతైనా పంపగలదనే అభిప్రాయం కల్గిందంటే, నీలో యేదో స్వేచ్ఛ, నిర్లక్ష్యం యేర్పడి—గురిలేని బ్రతుకైపోవచ్చు అందుకే ఈ విషయం నీ నుంచి రహస్యంగా దాచాము"

రాము నిజమే అన్నట్లు అక్కవైపు చూస్తూ మెల్లిగా లేచి రాజారావుదగ్గరకెళ్ళివచ్చాడు. నిర్మల అక్కడే కూచునిఉంది

"మామయ్య యేమన్నారో తెలుసా— ఒహో— అదేనా—అదేమంతపెద్ద సాయం రామూ! అంటూ తేల్చేశారు గొప్పవారి బుద్ధులు ఉన్నతంగానే ఉంటాయక్కా— ఏమంటావు? ఆయన ముఖాన్ని చూడగానే చేతులెత్తి దండంపెట్టాలనిపించింది అసలు నన్ను దాన్నిగూర్చి మాట్లాడనివ్వందే! పైగా యేమన్నారో తెలుసా? "ఇక నీకు ఉన్నసంగతి తెలిసిందికదా? ఇప్పుడు చదవటానికి అభ్యంతరం యేముంది నాయనా?" నాకెంతో శోధనకల్గింది-కానీఅక్కయ్యా! నాన్న, అమ్మ యీ సమయంలో ఇంకా బాధపడటం నా కిష్టంలేదు ఆ మిగిలిన కాస్త పొలం చూసుకోటానికే నాన్న ఆరోగ్యం అనుమతించదు మధు వెళ్ళిపోయాడన్న చింతతో అమ్మ ఎముకల గూడులా తయారైంది రవి—గుణం ఏవిధంగా రూపొందుతుందో చెప్పలేము అందుకే నాన్న, అమ్మకున్న భారం తొలగించి నా భుజాలమీద వేసుకోవాలని ఉంది అప్పుడైనా వారికి కొంత శాంతి లభిస్తుంది వంద నాకు ఖర్చయినా మరో వంద ఇంటికి పంపితే వాళ్ళకు సరిపోతుంది— వచ్చే పంట చిల్లరఖర్చులకు సరిపోతుందమకో ఎవ్వరినీ యాచించకుండా జీవితం వెళ్ళబోమకోవచ్చు . పోయినాడుట్నే పోక, అప్పులు మిగిల్చి అమ్మ, నాన్న జీవితాన్ని దుర్భరం చేసిపోయాడు నీవు వస్తే యేం ఖర్చుందదు— కుమును అక్కయ్య ఒకటి రెండురోజులకన్నా ఎక్కువ కాలం ఉండదు ఇచ్చినదాంతో తృప్తి చెందుతుంది. అమ్మో ! పలినక్కయ్యకి పిల్లలు లేకపోయినా, పురుళ్ళు లేకపోయినా రెండుమూడు నెలలుండటమే కాకుండా, తన భర్తకు ఖరీదైన గుడ్డలు పెట్టాలని పోట్లాడుతుంది పండగలకి తప్పక హాజరవుతుంది ఇంతకాలం పెట్టుకు రాగల్గారు గానీ ఇకపై చాల కష్టం అందుకే అంటాను వారి జీవిత శేషాన్ని బాధ్యతా రహితులై శాంతంగా గడిపితే భగవంతుడు వాళ్ళని మనకోసం యింకొంతకాలం అట్టిపెట్టగలడేమో— మనకోసం చింతిస్తూ లేయింబవళ్ళు డబ్బుకోసం యాతనపడుతుంటే వారి జీవితాలు త్వరలో అంతమవుతాయి అది నేను సహించలేను చదువు పూర్తిచేశాను— నా బాధ్యతలు గుర్తించాను— ఇక చదవాలని లేదు—అలా నిశ్చయించుకని మామయ్యతో యీ విషయాలే చెప్పాను—"

నిర్మల తమ్ముడివైపు గర్వంగా చూచింది తన తమ్ముడు రాము కింత ఉన్నతాశయం ఉందా? అమ్మ, నాన్న సుఖంకోసం తనకు లభించిన సదవకాశాన్ని ఒదులుకుని వారికోసం త్యాగం— త్యాగం కాదు— తన కోరికను చంపుకున్నాడా ? వారి సుఖమే తన శ్రేయస్సని తలంచాడా ? రాము హృదయం పరిపక్వమైంది ఇతని చేతిలో ఉన్న వారంతా సుఖపడితీరుతారు

"మీరంతా భలేవారే— మీరు చేసిన మేలుకు

వదంతులను వినకండి

వదంతులను ప్రచారం చేయకండి




ఇంట్లో బట్టలను ఉతుకుటలో సర్ఫ్‌ను మించినది లేదు ! మీ బట్టలు సర్ఫ్‌యొక్క ఉతికే అధిక శక్తి వల్ల, ఎంతో సులభంగా, అమిత తెల్లగాను, పరిశుభ్రంగాను ఉంటాయి... షర్టులు, చీరలు, పిల్లల బట్టలు, అన్నిటికీ నేడే సర్ఫ్‌ను వాడి చూడండి.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

'SU 25-X52TL

# బంగారు పంజరం

నా కళ్ళే ఆర్ద్రాలవ్వాలి కానీ— నీవు, మామయ్య యిద్దరూ నే నేదో ఘనకార్యాన్ని సాధించినట్లు ఆనందబాష్పాలు విడుస్తారు"

నిర్మల నవ్వింది— "అలాగే నవ్వుతూ ఉండక్కాయ్ అప్పుడే మా అందరి హృదయాల్లో వెన్నెల కురుస్తుంది" రాము అన్నాడు

* * *

రక్తం కరుడుకట్టేటంత చలి చల్లని గాలి వీస్తుంటే శరీరం ఒణికిపోతోంది చేతులు, పాదాలు మంచుగడ్డలా ఉన్నాయి; తిమ్మెర్లెక్కి సూదులతో పొడిచినట్లుంది తెల్లవారింది. కానీ, రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి

ఇంకా సూర్యోదయం కాలేదు ఒక కుంటివాడు చాలీచాలని పాత చిరుగుల బొంతను కప్పుకుని, కర్రను ఊతగా పెట్టుకుని సాగిపోతున్నాడు అతని కళ్ళలో జీవంలేనట్లుంది—ఒక కాలు లేచిపోతోంది—ఆకలికి ప్రేవులు రోదిస్తున్నాయి ఎప్పుడో ఒకప్పుడు కూలిపడిపోవచ్చు కానీ అతనిలో యేదో నిగూఢ శక్తి ముందుకు సాగిపోయేలా చేస్తోంది కొంత సేపు చెట్టుకానుకుని తిరిగివెళ్తున్నాడు ప్రాతఃకాల గంభీరతను భంగపరుస్తూ అలికిడి లేని ఆ రహదారిలో ఆ వ్యక్తి కర్ర చేసే శబ్దం టిక్—టిక్ మని విన్పిస్తోంది ఇంకొంతదూరం మాత్రం ఉంది అనుకుని రోడ్డుకు ఇరువైపుల యేదైన గృహం కనబడుతుందేమోనని ఆశగా చూశాడు చూచిన దృశ్యం అతని హృదయాన్ని గంతులువేసేలా చేసింది

ఎటు చూచినా చెట్లు, రాళ్లుతప్ప ఇంళ్లులేని ఆ ప్రాంతంలో ఒక చిన్న యిల్లు దూరంనించి అస్పష్టంగా అగుపించింది కుంటివాడు కర్ర సరి చేసుకుని వేగం హెచ్చించి వెళ్తున్నాడు

అది కొత్తగా కట్టిన ఇల్లు చిన్నది కానీ, చుట్టూ పెద్ద తోటఉంది పెద్ద ప్రహరీగోడ సిమెంట్ చేయబడినున్నగా ఉంది గోడమీద గాజుపెంకులు గ్రుచ్చిఉన్నాయి పెద్ద యినుప గేటు దాని ప్రక్కగా ఒక లావుపాటి త్రాడు ప్రేలాడుతోంది కుంటివాడు ఆ త్రాడు పట్టుకుని లాగాడు లోపల గంట మ్రోగిన శబ్దం విన్పించింది అతడుత్సాహంతో నాలుగైదుసార్లు లాగాడు ఎంతకూ జవాబు లేదు. లోపల మనుష్యులు లేరేమో అని గేటులోంచి చూస్తున్నాడు గేటుదగ్గిర నుంచుని చూస్తే ఇల్లు అగుపించదు గేటునుంచి కుడి ఎడమలకు దారిఉంది కాని, ఎదురుగా లేదు అతను నిస్పృహతో కూలబడిపోయాడు తరువాత యేం జరిగిందో అతనికి తెలియదు

ఆ సాయంత్రం ఒక లారీనిండుగా సామాను వచ్చింది ఆ సామానంతా యింట్లోకి సర్దిస్తున్నారు ఇంకొక కారులో రాజారావుగారు తోడల్లుడుతో, రుక్మిణమ్మతో వచ్చారు

వారు ముగ్గురు తోటంతా తిరిగి యిల్లుచూచారు రుక్మిణమ్మ అంది:

"చాలా బావుంది బావగారూ

"ఎంతైంది అంతా కలిసి ?"

"భూమి చాలా చౌకగా దొరికింది ఆ చెట్ల కలపనే తలుపులకు, కిటికీలకు వాడాము ఇక్కడి రాళ్ళు పగులగొట్టించి యింటికి వాడాము. బావి త్రవ్వించడానికి, మోటారుకు, మిగతా అంతా కలిసి దాదాపు పదివేలు అయిఉండాలి"

రుక్మిణమ్మ సామాను మోసుకొస్తున్నవారివైపు చూచి అంది "మనయింట్లో సామానులాఉందే ?"

"ఔను బోలెడుంది— అక్కడమాత్రం యేం ఉపయోగం ? అందుకే యెక్కువైన సామాను పంపించింది అమ్మాయి."

అతనడిగాడు "నిర్మల దీనికి సమ్మతించిందా ? మేడ అంతా ఖాళీగాఉంటే యిలా దూరంగా యిల్లు కట్టించి ఉంచాలని అంటే యేమంది ?"

"పాపం యేమంటుంది ? మనసులో బాధపడిందేమో గాని, పైకి మాత్రం యేమీ అనలేదు

ఇప్పటికి మరో 20 సం॥ ల తర్వాత ఒక మనుమడు ఒక కథ రాస్తూ అందులో ఒక అబ్బాయి అమ్మాయి విమానంలో ప్రేమించి పారిపోయినట్లు రాశాడు. అదీ అమెరికాకి. వాళ్ల తాతయ్య "నువ్వు సమకాలీన జీవితం రాయడంలేదు, ప్రేమించడం, లేచిపోవడం అంత సుళువు కాదు పైగా విమానంలో అని రాశావు?..." అన్నాడు.

"తాతయ్యా! నువ్వు నీ సమకాలీన జీవితం రాయాలని కదూ అంటావు! కాని నే రాసింది నా సమకాలీన జీవితం కాదు..." అన్నాడు.

డా॥ కాంతం (కొత్త ఢిల్లీ)

తనకూ తెలుసు; దూరంగా ఉంచితేనే మంచిదని— పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు"

గదుల్లో యెక్కడ పెట్టవలసిన సామాను అక్కడ సర్దించింది రుక్మిణమ్మ వాళ్ళు తిరిగి వెళ్తున్నప్పుడు వారి దృష్టి కుంటివాడిపై పడింది

"ఎవరతను ?" రాజారావుగారు మాలిని చూచి అడిగారు

"పారుగూరట బాబుగారూ!— తిండిలేక సంపాదించుకుందామని పట్నంపోతుంటే సొష వచ్చి మనింటి గేటుదగ్గర పడిపోతే, లోపలికి తెచ్చాను అన్నం వండుకుని తిన్నాడు వెళ్ళిపొమ్మన్నా నయ్యగారూ! పోనంటాడు— వాడికి భయంలేదు— తమరైనా గట్టిగా చెప్పండి"

"ఏ పేరేంటి ?"

"ముద్దయ్య"

రాజారావుగారు ముద్దయ్య ముఖంకేసి పరీక్షగా చూశారు ఆ కళ్ళలో—ఆ చూపులో యేదో లోపం ఉంది మరికాస్త దగ్గరగా వెళ్ళి చూచారు "నీ కన్నేమైంది ?"

వాడు కన్ను తడుముకుని అన్నాడు "చిన్నప్పుడు తుంటరిగా తిరిగేవాడినండి బాబూ! రైలెక్కిపోతుంటే టిక్కెట్టులేనివాళ్ళని పట్టుకోటానికి వస్తున్నారని తెలిసి బండి పూర్తిగా ఆగకముందే క్రిందికి దూకాను క్రింద ఏముందో చూసుకోలేదు బాబూ—అప్పుడే బండి సన్నటి వంటకాలువను దాటుతోంది అందులో నీళ్ళు లేవు చాలా పైనుంచి దబ్బున పడ్డాను కాలు విరిగింది సరైన మందు లేక, తీసివేశారు తలకు దెబ్బ తగిలి ఒక కన్ను పోయిందయ్యా—తమరు దయతలిస్తే తోటపని చేస్తాను కుంటోడినని అనుమానించకండి నాల్గు రోజులు చూశాకనే డబ్బు లిద్దురు గాని నాకు డబ్బులు కూడ వద్దు బాబూ! ఇంత అన్నం పెడితే చాలు"

"ఇలాంటి వెధవల్ని నమ్మకండి" రుక్మిణమ్మ తన ఉద్దేశాన్ని తెలియపర్చింది

"ఔనౌను వాడిని కాపలా కాస్తూ యింటివారుంటారు తెలిసినవాళ్లను, నమ్మకస్తులను కుదర్చాలి" ఆయన అన్నారు

వారి మాటలు విన్న ముద్దయ్య చేతుల్ని జోడించి వినయంగా నుంచుని అన్నాడు "బాబూ—కుంటోడిని దొంగతనంచేసి పారిపోయినా, పోలీసోళ్లు వెంటనే పట్టుకోగిలరు పరుగెత్తటం చేతకాదు నన్ను కనుక్కొని పట్టుకోవటం ఎంత కష్టం బాబూ!—పది గజాలు కూడ పోలేనేమో నే నసలు యింట్లోకే పోను ఆ మెట్లక్రింద పడుకుంటాను పగలు చెట్ల నీడ చాలు మీరు కాదంటే ఈ కుంటోడు ఇక్కడే చస్తాడు ఊళ్లో నాలాటివారికి పనెవరిస్తారు బాబ్బా" అతను కన్నీళ్లు కారుస్తూ చెబుతున్నాడు

"సరేలే—నీ మాట లెంత నిజమో కాని, నీ పరిస్థితి చూస్తే జాలిగా ఉంది మళ్లీ వారం దాటాక వస్తాము తోటంతా ఎలా ఉంచుతావో చూస్తాను"

"చిత్తం—చిత్తం" అనుకుంటూ వాడు సంబరంతో దూరంగా వెళ్లిపోయాడు

"పాపం" అంది రుక్మిణమ్మ ఈసారి

"ఇలాంటివారెందరో—కనీసం వీడు పనిచేసి కాని బ్రతకాలనుకుంటున్నాడు వీడి నిజాయితీ ఎంతో మనకు తెలియదయ్యే" ఆయన అన్నారు.

ముగ్గురూ కార్లో తిరుగు—ప్రయాణం సాగించారు

ఇల్లు చేరగానే స్వర్ణ పరుగెత్తుకుంటూ వచ్చి "అమ్మమ్మ, తాతయ్య, రాము మామ, రవి మామ వచ్చారు" అని చెప్పింది

కమలమ్మ కూతురు—యింటికి రావటం అదే ప్రథమం అందుకని రాజారావుగారు కూడ ఎంతో సంతోషించారు రాత్రి భోజనాలయినాయి చంద్రుని శీత వెన్నెలలో ఆరుబయట కూచున్నారు

"రామం ఎక్కడ పని చేస్తున్నా డేమిటి?" రుక్మిణమ్మ అడిగింది

"చంద్రగిరిలోనండి."

# బంగారు పంజరం

"చాల దూరమేనే"

"ఔను వదినా! ఏం చెయ్యాలి? భోజనం సర్యైంది లేదు అందుకే పెళ్లి చేయాలని ప్రయత్నం కాని వాడికేమో పెళ్లంటే గిట్టకుండా ఉంది అందుకని అన్నయ్యగారూ! మీ సాయం కోసం వచ్చాము మీ మాట వింటాడేమో పిలవుపెట్టి వచ్చాడు నేమా ఎప్పుడూ యిక్కడికి రాలేదు హైదరాబాదు చూచినట్లూ ఉంటుందని వచ్చాము"

"మంచి పని చేశారమ్మా ఎప్పుడు రమ్మన్నా ఏదో ఒకటి చెప్పేవారు వాయనా రామూ!—ఏం? పెళ్లెందుకు చేసుకోనన్నావు?"

"వాడికట అతిలోక సౌందర్యవతి, భూలోక రంభ కావాలిట అంతేకాదు బావగారూ! వాటు గైదు లేర్ల బంగారు మోసూ రావాలి."

అందరూ గొల్లున నవ్వారు రాము మందహాసం చేస్తూ అన్నాడు "పెళ్లి ఇప్పుడే వద్దన్నానండి రవి చదువు పూర్తయ్యాక, వాడు సంపాదించేవాడై ప్రయోజకుడయ్యాక చేసుకుందామని"

"బాగానే ఉంది—కాని రవి బి ఏ పూర్తిచేసి ఇంకేదైన చదివి అది ముగించేసరికి నాలుగయిదు సంవత్సరాలు కావూ?"

"ఈ కాలంలో మగవాళ్లకు ఆలస్యంగానే పెళ్లిళ్లవుతున్నాయిగా మామయ్యా"

"పెళ్లి చేసుకుంటే ఏం?" రుక్మిణమ్మ భర్త అడిగారు

"మీ కూతురు చండికాస్వరూపిణియై గజగజలాడిస్తూ నా ఆశయాన్ని నెరవేర్చనియ్యకపోతే?"

రాజారావుగారు హాయిగా నవ్వారు "అదంతా మగవాళ్లను బట్టి ఉంటుందయ్యా నీవు గట్టివాడవైతే, ఆమె ఆటలు సాగవుగా?"

"నిజమే, మామయ్యా! వెళ్లమని చెప్పకానిలేక మిరపకాయల పొగ వేసినట్లు చేస్తేనో? నా మనఃశాంతికి భంగం కల్గితేనో? తన మాట వినటం లేదని యితరత్రా నన్ను సాధిస్తే నా కేం సుఖం? రవి శ్రద్ధగా చదివితే నాల్గు సంవత్సరాలు పడ్తాయి అంతవరకు ఓపిక పట్టాలి"

"నీవు ఓపిక పడ్తావు మరి కాటికి కాళ్లు చాచుకున్న మాకు అన్ని సంవత్సరాలు కొన్ని యుగాలుగా ఉండవా రామూ?" ప్రసాద్‌గారు కొడుకులో మార్పు వస్తుందేమోనని ఆశగా చూచారు

"నాన్నా! నేను పెళ్లి చేసుకుని నా భార్య మాటను శిరసా దాలుస్తాను ఆర్థికంగా మన స్థితి సరిగా లేదు కౌలుదార్లు నిన్ను మోసం చేస్తున్నారు. రవి—భారం మోయలేరు వాడి చదువు అసంపూర్ణం కావచ్చు అప్పుడు మీ కేం సంతోషం? వాడి జీవితం కూడ వెలుగుబాటలో నడిస్తేనే కదా మీ కానందం? అందుకే చెబుతున్నా. వాడి పూచీ నాది; వాడు తన కాళ్లపై తాను నుంచునే శక్తి సంపాదించుకునేవరకు ఈమాట అసలు ప్రస్తావనకు తేకండి .... భోజనంమాటంటారా? పిజ్జు

హా దగ్గరకు వచ్చేస్తే బావుంటుంది. రవి ఎలాగూ హాస్టల్‌లోగా ఉండటం ?"

ఎవరి ఆలోచనల్లో వారు నిమగ్నమయ్యారు రాజారావుగారు దీర్ఘంగా ఆలోచించి అన్నారు "ఇకనే మండి బావగారూ — ఇంత బుద్ధిమంతుడైన పుత్రుని కన్నందుకు గర్వింపతగ్గ విషయం అలానే జరగనివ్వండి . కానీ ఒక్కమాట రామూ! రవి—భారం నేను వహిస్తే "

ప్రసాద్‌గారు గభాలున లేచి నుంచుని చేయి ఊపుతూ "అలా వీల్లేదండి బావగారూ ! ఒక్కరికి చేసిన సహాయం చాలు మీకెంతో కృతజ్ఞులము "

"అన్నగారూ! మీ రిలా అంటే మే మిప్పుడే వెళ్లిపోతాము" అంది కమలమ్మ

"మామయ్యా ! మీ సహృదయానికి, మాకు మేలు చేయదలంచినందుకు ఎంతో కృతజ్ఞులం కానీ ఈ విషయంపై ఇక చర్చించటం అనవసర మనుకుంటా "

నిర్మల ప్రేమ, జాలి, ఆర్ద్రతా మిళితమైన దృష్టితో తమ్ముడిని చూస్తుండిపోయింది తన తమ్ముడు ఇంతటివాడయ్యాడా ? భగవంతుని సృష్టి వైపరీత్యం కాకపోతే — ఒకడు అధోగతి పాలవటం ఏమిటి ? మరొకడు అందలం ఎక్కగల సమర్థుడు, అనుభవజ్ఞుడు కావడ మేమిటి ?

కమలమ్మకు కారులో చూడవలసినవన్నీ చూపారు ప్రతీది వింతతో చూస్తూ ఆనందించిం దామె

వారుండగానే రుక్మిణమ్మ సావర్ణకోటకు వెళ్లిపోయింది. ఆయన రిటైరయ్యారు శాశ్వత కాంపౌండ్లో పనిలేదు

తోటలో ఇల్లు చూడాలని అందరూ ప్రయాణమయ్యారు కానీ స్థలంలేక నిర్మల, మాలతి వెళ్లటం మానుకున్నారు

అరగంటలో కారు ఇంటిని సమీపించింది డ్రైవర్ త్రాడు లాగాడు, హారన్ మ్రోగించాడు కొంతసేపటికి మాలి పరుగెత్తుతూ వచ్చి తలుపు తెరచాడు రాజారావుగారు వియ్యంకులకు ఇంటికీ, తోటకు అయిన ఖర్చు విషయాలు చెబుతున్నారు

ఒక వారంలో తోట ఒక రూపాని కొచ్చింది ప్రతి చెట్టుకు పాదులున్నాయి నీరు ప్రవహించేందుకు త్రవ్వుతున్న కాలువ అసంపూర్తిగా ఉంది అక్కడక్కడ మళ్లలో చిన్న మొక్క లున్నాయి కొన్ని అప్పుడే అంకురిస్తున్నాయి రాజ రావుగారు మనసులో ఎంతో ఆనందించారు కుంటివాడు మంచి పనిమంతుడిలా ఉన్నాడే ! అనుకున్నారు

రాజారావుగారు ఇంటిని సమీపించారు ఆయనకు లోపలి కెళ్లటం ఇష్టంలేదు అందరి హృదయాల్లో ఏదో అవ్యక్తమైన బాధ—ఆ బాధ వారి అడుగులను ముందుకు సాగనివ్వటంలేదు

రాము పరిస్థితి నర్థంచేసుకుని అన్నాడు "ముందు నేను వెళ్లి చూచి వస్తాను మీరంతా ఇక్కడే ఆగండి "

రాము పిల్లి—అడుగులు వేస్తూ తలుపు త్రోసి లోపలి కెళ్లాడు. కొన్ని నిమిషాలకు రాము తిరిగి వచ్చి నెమ్మదిగా అన్నాడు "బావ నిద్రపోతున్నారు. నెమ్మదిగా రండి "

అందరూ ఒక్కసారి హాయిగా ఊపిరి పీల్చారు పడకమీద ప్రశాంతంగా, ఇహలోక బాధలకు దూరస్థుడై, తన లోకంలో విహరిస్తూ పడుకున్న ప్రకాశ్‌ను చూస్తూ నుంచున్నారు

కమలమ్మ అల్లుని చూచి ఏడు సంవత్సరాలు దాటింది రూపంలో భేదంలేక, కొద్దిగా చిక్కిన అల్లుని చూచి కొంగు నోట్లో కుక్కుకుని వెలుపలి కొచ్చేసింది ప్రతివారి హృదయంలో చెలరేగిన తుఫాను వారి నక్కడ ఉండనివ్వలేదు రాజారావుగా రస లక్కడ లేనేలేరు మిగతావారు గబగబ వచ్చేశారు

ఇంటికి దూరంగా వచ్చేశాక రాము అన్నాడు "అందుకే నిర్మలక్కయ్య అసలు రాదు "

"మంచిదేగా ? మానుతున్న పుండును రేపుకోవటం తప్ప—" ప్రసాద్‌గా రన్నారు.

రాజారావుగా రన్నారు "నేను కూడ రాను నాల్గు రోజుల క్రితం రుక్మిణమ్మ, ఆయన వెళ్లి స్టేషన్ నించి తిన్నగా ఇక్కడికే తెచ్చేశారుగా ? నేను అప్పుడుకూడ రాలేదు మీరంతా వస్తుంటే అబ్బాయిని చూడాలన్న కోర్కెతో వచ్చాను బావగారూ—ఏంచెయ్యను ? చూడాలని ఉంటుంది—చూచాక ఎంతో కాలం ఇదంతా కళ్లలో మెదులుతుంది ఆ బాధ భరించ శక్యంకానిది " ఆయన స్వరం గాద్గదికమైంది ఎవ్వరూ మాట్లాడలేదు

అందరూ గడ్డిమీద కూచున్నారు దూరంగా ఎందరో వస్తున్నట్లు అలికిడైంది తర్వాత "బాబుగారూ! జామపళ్లున్నాయి తెమ్మంటారా ?" అనే మాటలు దూరంనించి విన్పించినై

కమలమ్మ విభ్రాంతపోయింది హృదయాన్ని ఎవరో చేయిపెట్టి పలిపినట్లుయింది ఆ శబ్దం వచ్చిన వైపు పరీక్షగా చూస్తోంది ఎవ రతను? ఎవరి కంఠం ? ఇంత సుపరిచితంగా ఉందే ? ఎక్కడో విన్నది ! క్షణంలో ఆమెకు జ్ఞాపకం వచ్చింది అంత భాగ్యమా తన కొడుకు తిరిగి వస్తాడా ? ఎవరైన మభ్యపెడుతున్నారా? ఆమెలోని భావపరంపరలకు అంతరాయం గల్గింది దూరంగా కుంటివాడు వెదురుబుట్టను తలమీద పెట్టుకుని కుంటుతూ వస్తున్నాడు

అతని దృష్టిలో ఏం పడిందో గాని, అతని కాలు తడబడింది బుట్ట తలమీదనించి క్రింద పడిపోయింది జామపళ్లు చెల్లాచెదరై పోయాయి. వెనక్కు తిరిగి పారిపోబోయి పట్టు తప్పి బోర్లా పడ్డాడు

కమలమ్మ హృదయం ఎగిరి గంతువేసింది అంతలో హృదయంమీద భారంగా ఏదో పడినట్లుయింది చూస్తుండగానే రెప్పపాటులో కుంటివాడు దబ్బున పడిపోయాడు

కమలమ్మ ఆత్రంగా లేచి గబగబ నడుస్తూ "నాయనా మధూ!" అంటూ నెమ్మదిగా లేస్తున్న కుంటివాడిని సమీపించింది

వాడు లేచి నుంచుని కర్రను చంకక్రింద పెట్టుకుని వెళ్లటాని కుద్యుక్తుడయ్యాడు.




# తుషార్‌తో వండిన పదార్థాల రుచి ఇంట్లో అందరికీ యిష్టమే

తుషార్ వనస్పతిలో వున్న ఆ ప్రత్యేకమైన రుచి వల్ల అది కుటుంబాని కంతకూ యిష్టమైన పదార్థమైంది తుషార్‌తో చేసిన వంటకాలు ఎక్కువ రుచిగా వుండటమేగాక పుష్టికరం కూడా ఎందుకంటే తుషార్‌లో ఎ, డి విటమినులు వున్నాయి రుచికర ప్రాశనంకోసం తుషార్‌ను వాడండి!

## తుషార్

వనస్పతిలో ఎ, డి విటమినులు వున్నాయి.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

CPH/H1246

# ఎస్కార్ట్స్ పద్ధతిలో మీరు దినం ప్రారంభించారా?









ఎస్కార్ట్స్
బ్లేడులు
నిర్దుష్టమైన క్షౌరములకు

అన్ని పెద్దస్టోర్సులో
దొరకును

## బంగారు పంజరం

"మధూ—బాబూ! నేనురా ? అలా చూస్తావేం ?" ఆమె గొల్లున ఏడవటం ప్రారంభించింది అప్పటికే అక్కడకు నలుగురూ వచ్చేసి కమలమ్మ వైపు వింతగా చూస్తున్నారు ఆమె మధూ అనటంతో ప్రసాద్‌గారు రెండడుగులు ముందు కేసి కళ్లద్దాలు సరిచేసుకుని వాడి వైపు దీక్షగా చూచారు

వాడు వింతగా వెర్రిచూపు చూస్తూ వెకిలి నవ్వు నవ్వాడు.

"మధూ—మధూ !" అంటూ ప్రసాద్‌గారు కొడుకును ముట్టుకోటానికి దగ్గరగా వెళ్లాడు

కుంటివాడు నిగ్రహించుకోలేకపోయాడు క్రింద కూలబడిపోయాడు. కర్ర క్రింద పడి పోయింది ముఖాన్ని రెండు చేతుల్తో కప్పుకుని మధు వెక్కి వెక్కి ఏడుస్తూ "నేను మధును కాను నేను పాపాత్ముడిని—నన్ను మర్చిపోండి—ఇలా బ్రతకనివ్వండి—మీరంతా వెళ్లిపోండి "

అందరూ చుట్టూ చేరారు రాజారావుగారు ఆశ్చర్యపోయారు కమలమ్మ కొడుకును కౌగ లించుకుంది ఆ మాతృహృదయం పొందిన ఆనందం వర్ణనాతీతం ఆమె కొడుకును అనురాగంతో అక్కున చేర్చుకుని కన్నీరు కారుస్తోంది కన్నును తడిమిచూచింది కాలు స్పృశించింది ఆమె దుఃఖం వరదలై ప్రవహించింది

"నీ కీ గతి పట్టిందేమిరా తండ్రీ" అని భోరున ఏడుస్తోంది

మధు తల్లిని విడిపించుకొన్నాడు మొండి కాలును తడుముకుని గాద్గదికంగా అన్నాడు "నా పాపాలకు ప్రాయశ్చిత్తమమ్మా—రైలు క్రింద పడి నలిగి చనిపోయేవాడినే కానీ, బ్రతికాను—కానీ నా దుష్ట ప్రవర్తనకు చిహ్నంగా యీ రెండూ పోయినై నా నా అవినీతి కార్యాలకు ప్రతిఫలం ఇది "

రాజారావుగారు విస్తుపోయి వింటున్నారు కొడుకు తల్లిదండ్రుల క్షమాపణ కోరుకునే దృశ్యం చూచి అతని కళ్ళు చెమ్మగిల్లాయి రాము చిరు నవ్వుతో తమ్ముడి బబ్బ చరిచాడు

పండిన జామపళ్ళు తిని, నీళ్ళు త్రాగి వెళ్లటాని కుద్యుక్తులయ్యారు. అందరూ కారెక్కారు మధు మంచుమే ఉన్నాడు

"రా, బాబూ!" అంది కమలమ్మ

మధు బెల్లంకొట్టిన రాయిలా ఉండిపోయాడు

మధువైపు అందరూ తదేకంగా చూస్తుండి పోయారు

మధు తల్లిదండ్రులకు నమస్కరిస్తూ అన్నాడు "అవిటివాడిని, గుడ్డివాడిని—మీతో వచ్చి మీకు భారంగా ఉండటం నా ధ్యేయంకాదు .. నన్నిలా బ్రతకనివ్వండి ఈ తోటలో ప్రపంచానికే దూరంగా ఉన్నట్లున్న యీ ఇంట్లో నాకెంతో హాయిగా ఉంది మామయ్య దయవల్ల నన్ను నేను పోషించుకోగలను నాకు మిగిలిన ఈ అవయవాలతో ఇప్పుడైన కనీసం శ్రమించి పనిచేయనివ్వండి ఈవిధంగానైనా నా పాపం పరిహారం పొందగలదు, భగవంతుడు క్షమించగలడు "

కమలమ్మ కన్నీరు క్రుక్కుకుని రమ్మనమని బ్రతిమాలింది ప్రసాద్‌గారు మరీ మరీ అడిగారు రాజారావుగారు అడిగారు కానీ మధు అందుకు సమ్మతించలేదు

చివరికి రాజారావుగారన్నారు "నీ స్థానం యిక్కడ కాదు మధూ, తిరిగి వెళ్లిపో అమ్మకు, నాన్నకు ఇప్పుడైన నీనుంచి సంతోషం లభించేలా చెయ్యి మరొక మాలిని ఏర్పాటు చేద్దాం నువ్వు వచ్చేసెయ్ "

మధు వినమ్రుడై అన్నాడు "ఈ స్థలాన్ని వదిలి నే నెక్కడికీ వెళ్లను వేరే మాలిని కుదుర్చు కుంటే ఎక్కడికేనా వెళ్లిపోతాను .. అమ్మకు, నాన్నకు భారంగా ఉండటం నా కిష్టంలేదు . నా యీ స్థితిలో నన్నెవరూ పనికి పెట్టుకోరు . నా జీవితం ఈ యిల్లు వదిలానంటే నాశన మవు తుంది ... మీ యిష్టం ఉండమంటే ఇక్కడే ఉండి బావకు సేవ చేస్తూ, తీరిక సమయాల్లో తోటపని చేస్తూ కాలం వెళ్లబుచ్చుతాను వెళ్లి పొమ్మంటే మీ అందరికీ దూరంగా వెళ్లిపోతాను.

నిర్మలక్కయ్య దగ్గరి కొస్తే నాకు తప్పక ఓ మార్గం అగుపిస్తుందని వచ్చాను అనుకోని రీతిగా ఇక్కడ ఇల్లు కట్టిస్తున్నట్లు విన్నాను. మీ ఇంటినుంచి ఇక్కడి కొచ్చాను మీ ఇష్టం . కానీ, నా కోర్కె కాదనకండి "

రాజారావుగారు, కమలమ్మ, ప్రసాద్‌గార్లొకరి ముఖా లొకరు చూచుకున్నారు ప్రసాద్‌గా రన్నారు:

"అలాగే ఉండు నాయనా—కానీ, నీ పనిలో నమ్మకస్తుడవై బావను కంటికి రెప్పలా కాపా డుతూ ఉండు "

కమలమ్మ కొడుకు చేతిని ఆప్యాయంగా స్పృశించింది

"ఇక పోనివ్వండి కారు" అంది

రాము, మధు, రవి ఏకాలున నవ్వారు

"డ్రైవరేడీ కారు నడిపేందుకు ?" మధు నవ్వుతూ అడిగాడు

రాము హారన్ మ్రోగిస్తున్నాడు

మధు అన్నాడు "అక్కయ్యను రేపు పంపండి "

కదలిపోతున్న కారువైపు అలాగే చూస్తూ నించుండిపోయాడు మధు. (సశేషం)

---

## విచిత్ర వివాహం

8 వ పేజీ తరువాయి

వెళ్లిపోయాడు ఇది గమనించిన రాజా ప్రాణం కాస్త తెరిపినపడి 'హమ్మయ్య' అనుకున్నాడు

ఎక్స్‌ప్రెస్ ఓ జంక్షన్—స్టేషన్‌లో ఆగింది అక్కడినుండి బయల్దేరేందుకు ఓ పావుగంట వ్యవధి ఉంటుంది అందువల్ల రాజా వెంటనే బండి దిగి, తన టిక్కెట్టుతో స్టేషను బైట బుక్కింగ్ ఆఫీసు దగ్గరికి పోయి ఆ స్టేషను నుంచి మద్రా సుకు ఓ ఎక్స్‌ప్రెస్ టిక్కెట్టు తీసుకున్నాడు తన ఎదురుగా నుంచున్న టిక్కెట్టు కలెక్టర్ని చూచి కొయ్యబారిపోయాడు

తను చేసిన పని ఎవరూ చూడలేదని రాజా అనుకున్నాడే కాని, తన పెట్టెలోకి వచ్చిన టికెట్ కలెక్టరు తననే గమనిస్తున్నాడన్న విషయం గుర్తించలేదు

ఆ టికెట్ కలెక్టర్‌కు రాజా వ్యవహారం మొదట్నుంచీ అనుమానంగానే ఉంది తను పెట్టెలో ఎక్కినప్పట్నుంచి రాజా ప్రవర్తించిన విధానంవల్ల అతనికెందుకో అనుమానంవేసింది చేతిలో టిక్కెట్టు ఉండగా ఏమీ చేయలేడు తను మరి అతనేమీ తప్పు చేయకపోతే, చేతిలో టికెట్టు ఉంచుకునే ఎందుకు బెదురుతున్నట్లు ? ఎందుకైనా మంచి దని రాజా ఉన్న పెట్టెమీద ఓ కన్నువేసి ఉంచాడు

జంక్షన్— స్టేషన్‌లో రైలాగ్గానే రాజా ఆదరా బాదరా, దొంగచూపులు చూస్తూ బుక్కింగ్ ఆఫీసుకు వెళ్లటం టిక్కెట్టు కలెక్టరు చూశాడు వెంటనే అతని మనస్సులో రాజా పెట్టెలో స్పృహ తప్పి నిద్రపోతున్న కామజ్యోతి మెదలి, ఆమెను టిక్కెట్టు అడగలేదన్న విషయం జ్ఞాపకానికి వచ్చింది

వెంటనే తను కూడా రైలు దిగి, రాజాను వెంబ డించాడు రాజా టిక్కెట్టు కొనటం చూశాడు ఏమని అడగాలీ అని ఆలోచిస్తుండగానే, రాజా వెనక్కు తిరిగి ఇతన్ని చూడటం జరిగింది

"అయ్యా ! మీ రిందాక ఒక టిక్కెట్టు చూపించినట్లు జ్ఞాపకం ? మళ్లీ ఈ టిక్కెట్టు ఎవరికోసం ?" అతి మర్యాదగా, నిక్కచ్చిగా అడుగుతున్న ఈ వ్యక్తికి ఏం సమాధానమివ్వాలి ? రాజా కొంచెం ఇరుకున పడ్డాడు

"అబ్బే లేదండీ ! నా స్నేహితుడు ఈ స్టేషన్ నుంచి మద్రాసు వస్తానని వ్రాశాడు అతనికోసం టిక్కెట్టు కొన్నా అతనికోసమే ఎదురు చూస్తున్నా" అతి తాపీగా రాజా సమాధానం చెప్పాడు

"ఓహో ! అలాగా" అని ఆ టిక్కెట్టు కలె క్టరు కూడా కొంచందూరంలో నుంచున్నాడు

పావుగంట గడిచింది రైలు బయల్దేరే వేళయింది గంట కొట్టారు రాజా ఎవరికోసమో చూస్తున్నట్లు అటూ ఇటూ చూస్తున్నాడు. అతనికి ఎటు చూచినా కనపడుతున్నది టిక్కెట్ కలెక్టరే ! . ఇంకా ఎంతసేపు నుంచుంటావ్ ! పో ! అన్నట్టు గార్డు విజిల్ ఊది పచ్చజండా చూపాడు బండి కదిలింది బండికి బయ ల్దేరతూ రాజా తన ప్రక్కన చూశాడు ఆ టికెట్ కలెక్టర్ అక్కడ లేడు

బ్రతికాంరా బాబో ! అనుకుంటూ, రాజా ఒక్క ఊపున అప్పుడే ప్లాట్‌ఫారం వదలబోతున్న రైల్లో వచ్చిపడ్డాడు పక్కపెట్టె కిటికీలోంచి టిక్కెట్ ఎవరికోసమని అడిగిన వ్యక్తి తననే చూస్తున్నాడన్నవిషయం ఆ తొందర్లో గమనించలేదు.

మద్రాసు స్టేషన్ (అంటే ఎగ్మూర్) రానే వచ్చింది ఎంతదూరం నుంచి వచ్చానో చూశారా అని ఉసూరు మంటున్నట్టుగా బుస్సున ఆవిరి వదుల్తూ రైలువచ్చి స్టేషన్‌లో ఆగింది (సశేషం)

# గమనిక

ఆంధ్రసచిత్ర వారపత్రికకు పంపే రచనలు <u>సంపాదకుడు</u>, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పేరమాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు వ్రాయవద్దని మనవి

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

# రాజధాని కబుర్లు

9-వ పేజీ తరువాయి

వాళ్ల మనస్సుల్లో ఏవో కొన్ని అరమరలు ఉండే ఉంటాయి బాహాటంగా ముందుకు రావటానికి యిష్టంలేకుండా ఉంది అసలు ఈ విషయానికి సంబంధం లేకుండా ఉండటానికి అంతకంటె ఇష్టంలేదు అందువలనే ఇచ్చాననిపించుకోవటానికి ద్రవ్య రూపంలోనూ, కొన్ని బంగారం రూపంలోనూ జాతీయ రక్షణ నిధికి సమర్పించి తమ బాధ్యత తీరిపోయిందని చేతులు దులిపేసుకుంటున్నారు ఓ వెయ్యిమంది ఆవేశంతోనూ, ఆందోళనతోనూ, ఒక్కొక్క రూపాయి యిచ్చిన దారి లేదు ఓ ధనవంతుడు ఓ వెయ్యి రూపాయలు చందా యిచ్చిన దారి లేదు అయితే ప్రతివారు తమ తమ శక్తిమతనుబట్టి సహాయం చేయాల్సిందే! కాని అంత బాధ్యత, అంత ఆవేశం, వీళ్లలో కూడా రావాలి అలాంటి చైతన్యం ధనవంతుల్లో కూడా రావటానికి తగిన వాతావరణం కల్పించాలసి ఉంటుంది కేవలం డబ్బు యిస్తే సరిపోదు మనవాళ్ళు అచ్చువేసిన ఈ రూపాయి కాగితాలు మన దేశ సరిహద్దులు దాటితే చెల్లవు ఎంతసేపటికి ఆ నోట్లు యీ హద్దుల్లో ఎగురుతూ ఉండాల్సిందే! ఇతర దేశాల్నుంచి సాయుధ సామగ్రి తెచ్చుకోటానికి గాని, యితర పదార్థాలను దిగుమతి చేసుకోటానికి గాని, బంగారమే ఒక్కటే ఉపయోగపడుతుంది! దీన్నివ్వగల శక్తిమతగలవాళ్ళు ధనవంతులేకదా! కాని వాళ్ళుకూడా కాస్తోకూస్తో డబ్బిచ్చి సరిపెట్టుకుంటున్నారు

ఉస్మాన్ అలీఖాన్‌గారు అంటే నైజాంప్రభువు! నాలుగు లక్షల రూపాయలిచ్చి ఊరుకున్నాడు నైజాం నవాబంటే, ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ధనవంతుల్లో గణతికెక్కినవారు, ఆయన దగ్గరున్న బంగారపు రాసులమీద కట్టుకథలు అనేకం ఉన్నాయి వారుకూడా డబ్బే యిచ్చి, సంతృప్తిపడితే, మిగతావాళ్ల సంగతేమిటి? ఓ చిన్నపిల్ల చెవుల రింగులూనూ, మెళ్లో హారాన్ని యిచ్చినంత, ఆదుర్దా కూడా ప్రకటించకపోతే ఎట్లా? ఈ క్లిష్ట పరిస్థితుల్లో, నవాబులు, జాగీర్దార్లు, జమీందార్లు ముందుకు వచ్చి బంగారాన్ని యిస్తేనే, మనం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్య కొంతవరకు పరిష్కారం అవుతుంది బీదా బిక్కి జనం, పగలల్లా శ్రమించి సంపాదించిన దాంట్లో ఎంత పొదుపుచేసి యిచ్చినా అది గొప్ప త్యాగమే అవుతుంది వేలకువేలు లాభాలు సంపాదిస్తున్న వర్తక, వాణిజ్య ప్రముఖులు, వాళ్ల లాభాల్లో కొంత తగ్గించుకోవటం, ఏమంత త్యాగం కాదు

'సామ్రాజ్యపు దండయాత్రలో, సామాన్యుని సాహసమెట్టిది?' అనే ప్రశ్నకు ఆరుద్ర సమాధానమిచ్చారు

'పొంగారే శౌర్యం చూపిరి
బంగారపు రాసులు పోసిరి
కంగారూ, భీతి, బెదురూ
కలనైనా కనపడదాలపు'

వారి ఈ మనస్తత్వంతోనే, భూస్వాములు, ధనిక వర్గంవారుకూడా ముందుకు రావాలి. ★

# ఆయుధాల కొరకు
# ఆభరణాలను యివ్వండి







నిజం, ఈ క్రొత్త సబ్బు చాలా
బాగుగా శుభ్రపరుస్తుంది
ఆతేడా నేను కనిపెట్టేను.

అది ఏ ఇతర సబ్బులకంటె
చాలా కాలము నిలవుంటుంది,
అంతకంటె ఇంకేమి కావాలి.

జ్ఞాపకముంచుకోండి, అది ఝలక్, ఇకమరి ఎక్కువ
తామే ఏమిటనగా దానిని బజార్లను అమ్మకము చేయుచున్న
వారు, మార్గదర్శక సంస్థ గోద్రెజ్ సబ్బులలో ఉత్తమ నామము

ZA 3×3 62 TEL

# న్యూఢిల్లీ లేఖ

7వ పేజీ తరువాయి

లించింది పెద్ద పార్టీలు, విందులూ, ఆర్భాటాలూ ఉండవు ఏవో అత్యవసరంగా దేశరక్షణ విషయాలాలోచించాల్సివస్తే తప్ప వేసవిలో శీతల ప్రాంతాల్లో సమావేశాలు జరుపుకోవట మనేది ఉండదు రవాణా, తదితర స్థానికమైన వ్యయాలను వీలైనంతకు తగ్గించుకోటం, ప్రభుత్వపు రాతకోతలను వీలైనంతవరకు సరళంగా పోనివ్వటం కూడా పొదుపు చేయటమే”

పొదుపు బ్రతుకు అనేదే మన జీవిత పరమావధిగా నడుచుకోవాలి

మరొకమాట : మన ప్రధాన మంత్రి ఇటీవల పార్లమెంటులో ప్రసంగిస్తూ, తన మంత్రి మండలిని (18 మంది కాబినెట్ మంత్రులు, 12 మంది సహాయమంత్రులు, 22 మంది ఉప మంత్రులు, వీళ్ళుగాక 7 గురు పార్లమెంటరీ కార్యదర్శులు వెరసి 59 మందిని) ఏమైనా సరే తగ్గించుకునే స్థితిలో లేనని నిర్మొహమాటంగా చెప్పివేశారు అంతేగాక, ఈ మంత్రివర్గాన్ని తగ్గించాలన్న వాదం, మనిషి ఐదడుగుల ఎత్తే ఉండాలని వాదించినంత అసందర్భంగా ఉందని కూడా ఆయన అన్నారు ఒక్క మాటలో చెప్పాలంటే ఈ చైనాతో యుద్ధంలో విజయం పొందాలంటే తన ఈ 60 సభ్యుల మంత్రిమండలి ఉండితీరాలనుకుంటున్నారన్నమాట

అసలు ప్రధాన మంత్రికి ఇష్టంగాని ప్రతిపాదనేదైనా వచ్చినప్పుడు, అసహజమనో, వితండవాదమనో కొట్టిపారేయడం ఈ దేశానికొక అలవాటైపోయింది అగస్టు 14 వ తేది 1962 నాటి సరిహద్దులో ఉన్న పరిస్థితి మాట ప్రసంగిస్తూ ఒక ప్రకటనలో ఇలా తెల్పారు!

“మన సరిహద్దుల విషయంలో మనం చాలా ప్రమాద పరిస్థితిలో ఉన్నాం భారతదేశాన్నంతటినీ చైనా జయిస్తుందని పిచ్చాలోచనలు చాలా ఉంటున్నవి అదంతా వట్టిది చైనా దురాక్రమణ జరిపింది కాని అది పెను ఫలితం ఇవ్వటానికి మనం మెల్లగా చైనాను వెళ్ళగొట్టేందుకు ప్రయత్నించాలి అంతేకాని చైనా భారతదేశాన్నంతా కబళించి కూర్చుంటుందనుకోవటం కేవలం పత్యాగారం మాత్రమే కాదు, అనుకునే అవకాశం కూడా లేదు అదీకాక భారతదేశం అంతా అనుకున్నంత బలహీనమేమీ కాదు సైనిక, తదితర విధానాలవల్ల బాగా బలం పుంజుకుంటున్నది

మనం చైనీయులను మాత్ను స్థావరాలు తొమ్మిదెలకొల్పుకోనిచ్చామని ఎవరో అన్నారు అది నిజమే కాని అప్పటి పరిస్థితి వేరు వాళ్ళకు తొమ్మిది స్థావరాలుంటే మనకు 23—24 స్థావరాలున్నాయి, ఇంకా మూడురెట్లున్నాయేమో కూడా చెప్పలేం ఆటి స్థావరాలన్నీ వాటివాటి స్థావరాలకు అగ్ర స్థావరాలే అవి ఎక్కువ దూరంలో లేరు మన స్థావరాల్లో మనం బలపడినందువల్లనే చైనీయులకు ముందుకు చొచ్చుకు రావటమే గగనమైంది.

## హమేషా-తమాషా రచయితలకు విజ్ఞప్తి

ఈ శీర్షికకు పంపే రచయితలు కవరుపై స్పష్టంగా 'హమేషా-తమాషా' అని రాయాలి. స్టాంపులు జతచేసి పంపరాదని మనవి. సం॥



## న్యూఢిల్లీ లేఖ

అందువల్లనే, సైనిక దృష్ట్యా మనం గత రెండేళ్ళ క్రిందటికన్న పటిష్టంగా, అనుకూల పరిస్థితుల్లో ఉన్నామని చెప్పటం జరిగింది."

గత పదిరోజులుగా జరిగిన సంఘటనలు, గత ఆగస్టులో కనపడినంత అసంగతమైన విమర్శలుగా ఇప్పుడు కనబడటం లేదని నిరూపించాయి. అలాగే చిన్న మంత్రిమండలితో నిర్వహణం కూడా. దానికి మనిషైనవాడల్లా ఐదడుగులే ఉండాలన్న దానికి ఎక్కడా పొత్తే లేదు. ప్రధానమంత్రి ఇటీవల చేసిన ప్రసంగాల్లోకల్లా ముఖ్యమైన విషయమేమిటంటే ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏదీ స్థిరం కాదు అనేది. ఇప్పుడిప్పుడే ఈ మార్పుల దుమారం న్యూఢిల్లీలో బయల్దేరింది. ఎందుకంటే, కొత్త రక్షణమంత్రి, కొత్త సైన్యాధిపతి, రక్షణశాఖకు కొత్త కార్యదర్శిని—ఈ మార్పు కావాలని ప్రజలు కోరిందెంత అసంగతంగా ఉన్నా, నియమించటం జరిగింది. పరిస్థితులు ప్రధాన మంత్రి మంచి శక్తివంతమైన యుద్ధమండలిని ఏర్పరిచేటట్లు చేయగలవని ఇక్కడ అందరికీ నమ్మకం ఏర్పడి పోయింది.

దేశమంతా తన రక్షణకోసం సర్వస్వాన్ని ధార పోస్తుంటే ప్రధాన మంత్రి మాత్రం తన ఏళ్ళై ఇద్దరి మంత్రిమండలిని గాని, 7 గురు పార్లమెంటరీ కార్యదర్శులనుకాని తగ్గించుకునేందుకు సిద్ధపడటం లేదు. ఇంకా వాళ్ల శక్తిసామర్థ్యాలను గురించి ఎంత మౌనం వహిస్తే అంత మంచిది. శ్రీమతి లక్ష్మీమీనన్ (ఆమె ఎప్పుడూ ఉపయోగించకపోయినా) లిప్‌స్టిక్ నిరోధక ఉద్యమాన్ని ప్రారంభిస్తున్నది. ఆమె స్నేహితురాళ్లంతా కొత్త కొత్త సామగ్రి తెప్పించుకుంటున్నారు.

దేశంలో యుద్ధ సన్నాహాలను తీవ్రం చేసేందుకుగాను, ఆర్థిక, రక్షణ, సహకార శాఖ అనే కొత్త మంత్రిత్వశాఖను ఏర్పాటుచేయటం జరిగింది. అది చేయార్పిన పనిని బట్టి దానికి కేంద్ర సచివాలయ భవనాల్లో ఉత్తరపు బ్లాకులో ఇప్పుడు ఆరోగ్యశాఖ ఉంటున్న భవనంలో ఏర్పాటు చేయించి పాటియాలా భవనాన్ని ఆరోగ్యశాఖకు కేటాయించారు.

మహాత్మాగాంధి అనుచారిణి ప్రస్తుత ఆరోగ్య మంత్రిణి డా. సుశీలానయ్యార్, ప్రధాన మంత్రిని కలుసుని తమ శాఖ ఇదివరకుంటున్న భవనాన్ని కొత్త శాఖకు కేటాయింపు రద్దు చేయించేశారు.

ఏమైనా ఆ భవనం నుంచి ఆ శాఖ తరలించి నష్టపడేది డా. నయ్యరేగాని భారతదేశం ప్రాముఖ్యము కాదన్నమాట. దీన్ని వదిలినా అసలు ప్రశ్న ఇంకొకటుంది. డా. నయ్యార్ పలుకుబడికి మన ప్రధానమంత్రి ఎందుకు లొంగిపోయినట్లు? అంటే భారతదేశమంతా ఐక్య శక్తితో జాగ్రుతమైన ఈ సమయంలో శ్రీ నెహ్రూ మంత్రిమండలి ఆయన అండన బ్రతుకుతున్నదన్నమాట. ఎవర్నీ వెళ్లేట్టు మాట అనటం పాపం అయినను తప్పించలేదు మరి!


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

